శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః

    

# దివ్యప్రబంధాలలో వరాహావతార వైభవం




**సంకలనం, తాత్పర్యం:**

'పండిత రత్న' డా॥ ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అప్పగ శింగరాచార్యులు



**సంపాదకుడు:** ఈయుణ్ణి అనంత రంగ రామన్

**24-01-2022**

# విజ్ఞాపనం

**గీతా దివ్యకవీంద్రవాగ్జలనిధౌ రత్నాయమానా ఇమాః**
**వారాహాద్భుతభవ్యరూపసుగుణస్తోమాదినుత్యాత్మకాః,**
**ఉద్ధృత్య వ్యలిఖం తదర్థమపి సమ్మోదం పరం ప్రాప్నుయుః**
**శ్రీమత్కోలతనోః పదాబ్జనిహితస్వాంతాః గుణజ్ఞా ఇతి.**

"**బహూని మే వ్యతీతాని**" అని గీతాచార్యుడు స్వయంగా తన అవతారాలు అనేకం అన్నాడు. వేదం "**బహుధా విజాయతే**" (అనేకవిధాలుగా అవతరిస్తున్నాడు) అని అంటూ భగవదవతారాలు అనేకం అని తెలిపింది. ఆళ్వార్లు కూడా "**నిలవరంబిల పల పిఱప్పాయ్**" (అవధి లేని జన్మలను కలవాడు) అని భగవదవతారాలు లెక్కలేనివి అన్నారు. ఈవిధంగా భగవంతుని అవతారాలు అనేకమైనా, వాటిలో పది అవతారాలు ప్రధానంగా ఇతిహాస పురాణాలలో, ఆళ్వార్ల సూక్తులలో కీర్తింపబడ్డాయి. ఈ పది అవతారాలలో వరాహ అవతారం ఒకటి. ఈ అవతారం వాత్సల్య గుణానికి ప్రతీక.

ఈ అవతారవైభవాన్ని వేదాలు, మహర్షులు, దివ్యసూరులు దర్శించి విశేషంగా వర్ణించారు. ప్రత్యేకించి ఆళ్వార్ల పాశురాలు కనిపించే ఈ అవతారవర్ణన చాలా విలక్షణంగా కనిపిస్తుంది. భూమిని ప్రళయ సముద్రంనుండి ఉద్ధరించిన విషయమే కాక, ఆ స్వామి తమకు జ్ఞానాన్ని అనుగ్రహించిన విషయాన్ని ఆళ్వారులు ప్రస్తావించారు. అంతేకాక, వరాహస్వామికి కల అలౌకికమైన సౌందర్యాన్ని, వాత్సల్యాన్ని కూడా పలు చోట్ల ప్రస్తావించారు. ఈసూక్తులన్నీ సాహిత్య రసికులకు చాలా భోగ్యాలుగా ఉంటాయి.

ప్రస్తుతం ఆళ్వారుల దివ్యప్రబంధాలలో గోచరించే వరాహస్వామికి సంబంధించిన పాశురాలను సమీకరించి, కూర్చి, వాటిని తాత్పర్యంతో పాటు ప్రపన్న గోష్ఠికి, సాహిత్య రసికులకు అందివ్వాలనే ప్రయత్నమే ఈ గ్రంథంగా రూపుదిద్దుకున్నది. దీనితోపాటు వరాహస్వామి వైభవానికి సంబంధించిన విశేషాలను తెలియజేసే అవతారిక కూడా చేర్చబడింది. ఈ అవతారికలో ఇంచుమించుగా ఎక్కువ భాగం, ప్రసిద్ధ ఉపన్యాసకులు, ఉ.వే.శ్రీమాన్ వేళుక్కుడి కృష్ణన్ స్వామివారు రచించిన **"నాన్ కండ నల్లదు"** అనే తమిళ గ్రంథంనుండి  కృతజ్ఞతా పూర్వకంగా, దానోహ పురస్సరంగా స్వీకరించబడింది.

చాలాకాలంగా ఈ ప్రయత్నాన్ని చేయాలనే భావం మనసులో ఉన్నా, అది, వరాహస్వామి అనుగ్రహం చేత ఇప్పటికి ఫలించింది. గోదాదేవి, తాను అనుగ్రహించిన ప్రబంధాలలో ఎన్నో అవతారాలను ప్రస్తావించినప్పటికీ, వరాహావతారవిషయంలో ఆమెకు కల అభినివేశం విలక్షణమైనది. బహుశా దీనికి కారణం ఆమె భూదేవి అంశచేత అవతరించడం కావచ్చు. భూదేవిని ఆపదనుండీ ఉద్ధరించినది వరాహ భగవానుడేగదా! గోదాదేవి వైభవాన్ని, ఆమె సూక్తుల వైభవాన్ని అనుసంధించుకునే అవకాశం కలిగిన ఇటీవలి ధనుర్మాస సందర్భంగా, ఆమె విశేషంగా స్తుతించిన వరాహస్వామి వైభవం ఈ గ్రంథం ద్వారా ప్రకాశనం చేయబడుతున్నది. ఈ వాచిక కైంకర్యం భూదేవికి, ఆమెకు రక్షకుడైన వరాహస్వామికి, వీరిద్దరినీ ఆరాధించే భాగవతలోకానికి తృప్తిని కలిగిస్తుందని భావిస్తాను. ఈ గ్రంథం సిద్ధం చేయడంలో నాకు సహకరించిన కుమారుడు, చిరంజీవి అనంతరంగ రామన్ కు అనేక మంగళాశాసనాలు. ఇందులోని లోటుపాట్లను సహృదయ పాఠకులు విశాలహృదయంతో మన్నిస్తారని భావిస్తాను. స్వస్తి.

భవదీయుడు,

**ఈ.ఏ.శింగరాచార్యులు**

# విషయసూచిక

# వరాహావతార వైభవమ్

**తస్య యజ్ఞవరాహస్య విష్ణో రమితతేజసః,**
**ప్రణామం యేపి కుర్వంతి తేషామపి నమో నమః.**

'అవతారం' అనే సంస్కృత పదానికి క్రిందకు దిగడం అని అర్థం. భగవంతుడు అవతరిస్తున్నాడు – అని అంటే వైకుంతం అనే ఎత్తైన చోటునుండి పాలసముద్రం వరకు దిగి, అక్కడ నుండి, ఈ భూమిపై దేవతలు, మానవులు, తిర్యక్కులు మొదలైన రూపాలను పొంది, ప్రత్యక్షం అవుతున్నాడు – అని అర్థం. ఆ అవతారాలు అనేకమైనా, వాటిలో దశావతారాలు అని పది అవతారాలు ముఖ్యంగా చెప్పబడుతున్నాయి. వీటిని ఆళ్వార్లు అందరూ తమ దివ్యప్రబంధాలలో కీర్తించారు. **"తేవుడైయ మీనమాయ్ ఆమైయాయ్ ఏనమాయ్ అరియాయ్ క్కుఱళాయ్ మూవురువిల్ ఇరామనాయ్ క్కణ్ణనాయ్ క్కఱ్కియాయ్"** (దివ్యమైన రూపాన్ని కల మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, పరశురామ, శ్రీ రామ, బలరాములుగా, శ్రీకృష్ణుడుగా, కల్కిగా) (పెరియాళ్వార్ తిరుమొళి— 4—9—9) అని అంటూ పెరియాళ్వార్లు ఈ పది అవతారాలను స్తుతించారు.

ఈ పది అవతారాలలో మొదటి ఐదు అవతారాలు కృతయుగంలో, పరశురామ శ్రీరామావతారాలు త్రేతాయుగంలో, బలరామ కృష్ణావతారాలు ద్వాపరయుగంలో సంభవించాయి. కల్కి అవతారం కలియుగంలో సంభవిస్తుంది. అంతేగాక, మొదటి మూడు అవతారాలు తిర్యక్ రూపాలలోను, నరసింహావతారం మానవ, జంతు రూపాల కలయికలోను, వామనావతారం దేవరూపంలోనూ, చివరి అయిదు అవతారాలు మానవ రూపంలోనూ సంభవించాయి. ఇది మానవ జాతి పరిణామానికి సూచకమని విజ్ఞాన శాస్త్రజ్ఞులు అంటారు.

**ఎన్నిన్న యోనియుమాయ్ ప్పిఱన్దాయ్"** (ఎన్ని జాతులలో నీవు అవతరించావో) అని నమ్మాళ్వార్లు కూడా భగవంతుడు ఎన్నో జాతులలో, రూపాలలో అవతరిస్తాడు అని అన్నారు.

శ్రీ భాగవతంలో శుక మహర్షి 25 అవతారాలను ప్రస్తావించారు. దశావతారాలు కాకుండా యజ్ఞ, దత్తాత్రేయ, కపిల, సనత్కుమార, నరనారాయణ, ధ్రువ, పృథు, వృషభ, హయగ్రీవ, హరి, హంస, ధన్వంతరి, వ్యాస, బుద్ధావతారాలు అనే మరికొన్ని అవతారాలు, దశావతారాల కంటే భిన్నమైనవి. ఇవి భాగవతంలో ప్రస్తావించబడ్డాయి.

**అవతార ప్రయోజనాలు:**

**"పవిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"** అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో మంచివారిని రక్షించడం కోసం, దుష్టులను శిక్షించడం కోసం, ధర్మాన్ని సుస్థాపించడం కోసం తాను అవతరిస్తానని అన్నాడు. ఈ మూడు భగవంతుని అవతారాలకు ముఖ్య ప్రయోజనాలు. ఇంతేకాక, కరుణయే మూర్తీభవించిన భగవంతుడు తన అవతారాల ద్వారా తన కళ్యాణగుణాలను మనకు వ్యక్తపరచి, వాటిలో మనం ఆసక్తిని పొందేటట్లు చేసి, మనం చక్కగా జీవించడానికి దారిని చూపిస్తాడు. ఈ విషయాన్ని భగవద్రామానుజుల శిష్యులైన కూరేశులు 'అతిమానుషస్తవం' అనే స్తోత్రంలోని **"అతిమానుషశీల వృత్తవేషైః అతివృత్తామర విక్రమ ప్రతాపైః, అతిలంఘిత సర్వలోక సామ్యం వరయే వైష్ణవవైభవావతారమ్"** (మానవుల శీలన్ని, వృత్తాన్ని, వేషాన్ని అతిక్రమించిన శీలంతో, వృత్తంతో, వేషంతో, దేవతల విక్రమాన్ని, ప్రతాపాన్ని మించిన విక్రమంతో, ప్రతాపంతో, లోకసామ్యాన్ని అతిక్రమించిన భగవానుని అవతారాలను ఆశ్రయిస్తున్నాను) అనే శ్లోకం ద్వారా తెలియజేశారు. మానవులవలె కాకుండా, దివ్యమైన స్వభావాలు, నడత, రూపం మొదలైనవాటితో వీరధీరచరిత్రలను ఎన్నింటినో చేసిన, సాటిలేని భగవంతుని వైభవావతారాలను నేను ఆశ్రయిస్తున్నాను – అని ఈ శ్లోకంలోని సంగ్రహమైన భావం. తన గుణాలను వ్యక్తం చేయడం కోసమే భగవంతుడు మాటిమాటికి అవతరిస్తున్నాడు. అంతేకాక, మన ఇంద్రియాలకు

అందనివాడు అతడు. **"మన నుణర్వళవిలన్ పొఱియుణర్ వవైయిలన్"** (అంతరింద్రియానికి అందనివాడు, బాహ్యేంద్రియాలకు అందనివివాడు) అని నమ్మాళ్వార్లు భగవంతుడు మనసువల్ల గాని, బాహ్యేంద్రియాలవల్లగాని తెలుసుకోవడానికి వీలులేనివాడు అని అన్నారు.

## వరాహావతారం:

వరాహశబ్దానికి తెలుగులో 'పంది' అని అర్థం. జంతుజాతులన్నిటిలో చాలా నీచమైన జాతిగా మనం భావించే ఈ రూపంలో పురుషోత్తముడు అవతరించడం అతని సౌలభ్య గుణానికి సూచకం. ఈ విధంగా ఇటువంటి నీచ జాతిలో భగవంతుడు జన్మించడానికి కల కారణం ఏమి? అనే విషయాన్ని గమనించాలి.



**శ్రీ ప్రళయవరాహస్వామి – కల్లహళ్ళి (మైసూరు సమీపంలో)**

ఒకానొక సమయంలో బ్రహ్మ పుత్రులైన సనకుడు, సనత్కుమారుడు మొదలైనవారు శ్రీమహావిష్ణువును దర్శించాలని వెళ్లారు. అప్పుడు భగవంతుడు యోగనిద్రలో ఉన్నందున ద్వారపాలకులైన జయ విజయులు వారిని లోపలకు పోనివ్వకుండా అడ్డుకున్నారు. వారు తమను లోపలకు పోనివ్వమని మూడుసార్లు ఎంతగా వేడుకున్నా జయవిజయులు అంగీకరించనందున, వారిని అసుర జాతిలో మూడు పర్యాయాలు జన్మించవలసినదని వారికి బ్రహ్మపుత్రులు శాపం ఇచ్చారు. ఆ శాపానికి భయపడిన జయ విజయులు మహా విష్ణువును ఆశ్రయించగా, భగవంతుడు వారిని సమాధానపరచి, "మీరు అసుర జాతిలో జన్మించిన మూడుసార్లు నా చేతనే వధింపబడతారు" అని పలికాడు. బ్రహ్మపుత్రులు ఇచ్చిన ఈ శాపం కారణంగా జయవిజయులు మొదటి పర్యాయం హిరణ్యాక్ష హిరణ్యకశిపులుగా కృతయుగంలో, రెండవ పర్యాయం రావణ కుంభకర్ణులుగా త్రేతాయుగంలో, మూడవ పర్యాయం శిశుపాల దంతవక్త్రులుగా ద్వాపర యుగంలో జన్మించారు. ఈ విధంగా మూడు యుగాలలో మూడు విధాలుగా జన్మించిన వీరు భగవంతుని చేతనే వధింపబడ్డారు.

వరాహావతారాన్ని ధరించి భగవంతుడు హిరణ్యాక్షుని వధించిన వృత్తాంతం, శ్రీ విష్ణు పురాణంలో శ్రీ పరాశర మహర్షి, శ్రీ భాగవతంలో శ్రీశుక మహర్షి చాలా అందంగా వివరించారు. దాని ప్రకారం ఆ వృత్తాంతం ఈ విధంగా గోచరిస్తుంది. హిరణ్యాక్షుడు భూదేవిని ప్రళయ సముద్రంలో లోపలకు ముంచి బంధించాడు. భూదేవి అపుడు తనను రక్షించమని భగవంతుని ప్రార్థించింది. ఆ సమయంలోనే బ్రహ్మ తన పుత్రుడైన స్వాయంభువ మనువును సృష్టి కార్యాన్ని చేయమని అజ్ఞ పించాడు. అయితే అప్పుడు భూమిని హిరణ్యాక్షుడు సముద్రం లోపల బంధించినందున, మనువు తాను సృష్టించిన ప్రజలను ఎక్కడ నివసింప చేయగలడు? అందువల్ల, అతడు బ్రహ్మను ఉద్దేశించి ఉద్దేశించి **"యదోకః సర్వసత్వానాం మహీ మగ్నా మహాంభసి, అస్యాఉద్ధరణే యత్నో దేవ దివ్యా విధీయతామ్"** (శ్రీ భాగవతం –3– 13– 15) (దేవా! సముద్రం లోపల మునిగి ఉండే భూదేవిని బయటకు తీసుకుని రావడం కోసం నీవు ప్రయత్నించు) అని ప్రార్థించాడు.

అప్పుడు, బ్రహ్మ భూమిని సముద్రం నుండి బయటకు తీసుకుని రావడం కోసం తగిన ఉపాయాన్ని గురించి ఆలోచించడం ఆరంభించగానే అతని ముక్కునుండి చిన్న వరాహరూపం బయటకు వచ్చింది. **"వరాహతోకః నిరగాత్ అంగుష్ఠపరిణామకః....గజమాత్రః ప్రవవృధే తదద్భుత మభూన్మహత్"** (శ్రీ భాగవతమ్—03—13—18, 19) (చూస్తూ ఉండగానే ఆ వరాహ శిశువు పెద్ద ఏనుగు పరిమాణాన్ని, అంతకంటే మించిన పరిమాణాన్ని పొంది, వృద్ధి చెందింది) – అని ఈ విధంగా వరాహస్వామి అవతార వృత్తాంతం శ్రీ భాగవతంలో వర్ణింపబడింది.

ఈ విధంగా వరాహరూపాన్ని ధరించిన భగవానుడు సముద్రం లోపల ప్రవేశించి, హిరణ్యాక్షునితో పోరాడి అతనిని వధించి, భూదేవిని తన కోర దంతం అగ్రంతో గుచ్చి ఎత్తి, తన ఒడిలో పెట్టుకొని, భూవరాహ స్వామిగా లోకానికి తన రూపాన్ని సాక్షాత్కరింప చేశాడు.

## వేదంలో వరాహావతార ప్రశంస:

యజుస్సంహితలో (7-1-5) వరాహావతారాన్ని తెలిపే ఈక్రింది వాక్యాలు గోచరిస్తున్నాయి.

'వేదాంతకౌస్తుభ'మనే ప్రాచీనగ్రంథంలో ప్రజాపతి శబ్దవిచార సందర్భంలో ఈ వేదవాక్యాలు ఉట్టంకింపబడ్డాయి.

**"ఆపో వా ఇదమగ్రే సలిలమాసీత్. తస్మిన్ ప్రజాపతి ర్వాయుర్భూత్వా అచరత్. స ఇమామపశ్యత్. తాం వరాహోభూత్వా అహరత్"** (ఈలోకం మొదట జలమయంగా ఉన్నది. అందులో సర్వేశ్వరుడు వాయురూపిగా సంచరించాడు. అతడు ఈభూదేవిని చూచాడు. వరాహరూపియై ఆమెను ఉద్ధరించాడు)

ఇక్కడ ప్రజాపతి శబ్దంచేత చెప్పబడేవాడు భూమీనాథుడైన నారాయణుడే – అనే దానిని పలు ఇతిహాసపురాణ వచనాలు తెల్పుతున్నాయి. తైత్తిరీయ నారాయణవల్లి కూడా దీనిని స్పష్టం చేసింది. **"ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేన శతబాహునా"** (నూఱు బాహువులను కల వరాహమూర్తిచే నీవు ఉద్ధరింపబడ్డావు) అనేది ఆవాక్యం. ఇక్కడ కృష్ణశబ్దం వరాహమూర్తిని తెల్పుతుంది. దీనికి

తగినట్లుగా **"కృషిర్భూవాచకః శబ్దః ణస్తునిర్వృతివాచకః, విష్ణుస్తద్భావ యోగాచ్చ, కృష్ణ ఇత్యభిధీయతే"** ('కృషి' – అనే పదం భూమిని తెల్పుతుంది. 'ణః' అనేది ఆనందాన్ని తెల్పుతుంది. విష్ణువు ఆనందరూపి కనుక, భూమికి ఆనందాన్ని కల్గించినందున కృష్ణుడనబడుతున్నాడు) – అనే కృష్ణశబ్ద వ్యుత్పత్తి గ్రాహ్యం. నల్లని రూపాన్ని కలవాడనే అర్థం, శ్వేతవర్ణుడైన వరాహమూర్తికి అన్వయించదుకదా!

**శతపథబ్రాహ్మణంలో వరాహావతార ప్రస్తావన :**

**"అథ వరాహవిహితమ్ `ఇయత్యగ్ర ఆసీత్' ఇతి. ఇయతీహ వా ఇయమగ్రే పృథివ్యాస ప్రాదేశమాత్రీ. తాం యమూష ఇతి వరాహ ఉజ్జఘాన. సోస్యాః పతిః ప్రజాపతిః. తేనైవైన మేతస్మిన్ మిథునేన ప్రియేణ ధామ్నా సమర్ధయతి. కృత్స్నం కరోతి"** (శతపథ–14–1–2).(తరువాత



**"ఇయత్యగ్ర ఆసీత్"** అనే మంత్రంతో వరాహం చేత పెకలించబడిన మట్టిగడ్డను లేడిచర్మంపై పెట్టాలి. ఈ భూమి మొదట ఏతావన్మాత్రంగా కదా ఉన్నది. సముద్రంలో చిన్న ప్రాదేశాన్ని

పొందినదిగానే ఉన్నది. ఆ భూమిని వరాహమూర్తి అయిన పరమాత్మ "ఓ భూమీ! ఎక్కడ మఱగుపడ్డావు?" అని పల్కిపైకి ఉద్ధరించాడు. అతడే జీవులకందఱికి తండ్రియై, ఈమెకు పురుషుడై ఉండేవాడు. అందువల్ల మహీవరాహరూప మిథున సంబంధం కల ఈకర్మతో ఈయాగంలో ప్రవర్గ్యాన్ని భోగ్యమైన తేజస్సుతో నింపుతున్నాడు. యాగాన్ని కూడా సుసంపన్నం చేస్తున్నాడు) .

అందఱికంటే ఉన్నతుడైన పరమాత్మ జాతులన్నిటిలో అథమమైన మత్స్యకూర్మ వరాహజాతులలో అవతరించిన రీతిని వేదం విశదంగా పల్కింది. ఆ తరువాత పరత్వాన్ని ప్రదర్శించే నారసింహ, వామన, త్రివిక్రమావతారాలను కూడా స్పష్టంగా తెల్పింది. పరశురామావతారం ఆవేశావతారమైనందున దీనిని గూర్చిన ప్రస్తావనను వేదం చేసి ఉండకపోవచ్చునని తోస్తుంది. రామకృష్ణాద్యవతారాలు కూడా సౌలభ్యగుణ ప్రధానమైనవి కనుక, పరత్వాన్ని ప్రధానంగా పలికే వేదంలో వాటి ప్రస్తావన వివరంగా లేదు. వాటి సూచనలు మాత్రం కన్పిస్తాయి.

## వరాహావతారంలోని వైలక్షణ్యం:

ఆఝ్వార్లు, ఆచార్యులు ఏకకంఠంగా శ్రీ వరాహస్వామిని విశేషంగా కీర్తించారు. "వరాహస్వామియే చాలా గొప్పవాడు, ఆ స్వామి చరణాలను ఆశ్రయించడమే ఉన్నతగతిని పొందడానికి తగిన దారి" – అని వారి అభిప్రాయం. నమ్మాఝ్వార్లు 'తిరువిరుత్త' ప్రబంధం చివరలో **"ఇానప్పిరానై అల్లాలిల్లై, నాన్ కండ నల్లదువే"** అని అంటూ, "నిత్య సూరులకు, దేవతలకు, మానవులకు తిర్యక్కులకు అందరికీ ఆశ్రయించదగిన ఒకే ఒక దైవం వరాహ స్వామి" – అని నిశ్చయించి పలికారు. దీనిని అనుసరించి శ్రీ పరాశర భట్టర్, వేదాంత దేశికులు మొదలైన మన ఆచార్యులు పలువురు చాలా అద్భుతమైన అర్థాలను వరాహస్వామిని కీర్తిస్తూ తెలిపారు.

## శ్రీపరాశర భట్టర్ సూక్తులలో వరాహస్వామి వైభవం:

శ్రీ పరాశర భట్టర్ అనుగ్రహించిన శ్రీ రంగరాజస్తవంలో వరాహస్వామిని కీర్తిస్తూ **"శరణమసి మే రంగిన్! త్వం మూలకోలతనుర్భవన్"** (ఓ శ్రీరంగనాథా! ఆదివరాహరూపివి అయిన నీవు నాకు శరణమై ఉన్నావు) – అని వరాహస్వామి లోకానికి అద్వితీయమైన శరణం అని పలికారు. శ్రీభట్టర్, వరాహస్వామి చేసిన ఉపదేశాలు నిండిన, వరాహ పురాణంలోని ఒక భాగమైన కైశిక పురాణానికి వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. అందులో వరాహస్వామి వైభవాన్ని తెలియజేసేటప్పుడు మిగిలిన అవతారాలను గురించి పలుకుతూ, చాలా వేడుకగా వాటిలోని లోపాలను ప్రస్తావించారు.



**శ్రీ కళ్వర్ పెరుమాళ్ – కంచి**

వరాహస్వామి అనుగ్రహించిన ఉపదేశాన్నే మనం పరిగ్రహించాలి. మిగిలిన ఉపదేశాలు దోషాలు కలిగినవి. ఎందుకంటే—

వైకుంఠనాథుడు మనకు అందనంత ఎత్తులో ఉంటాడు. అతడు పలికిన సూక్తులు వైకుంఠంలో ఉండే గొప్ప వారికే ఉపయోగపడతాయి.

పాల సముద్రంలో ఉండే పరమాత్మ పలికిన సూక్తులు ఆ పాల సముద్రం కెరటాలు ధ్వనితో కలిసిపోయి అర్థంలేనివి అవుతాయి.

మత్స్యావతారాన్ని మనం ఆశ్రయించడం సాధ్యం కాదు. అతడే స్వయంగా సముద్రం నుండి తీరానికి చేరలేనివాడు. మనలను ఏ విధంగా సంసారం సముద్రంనుండి బయటకు తీసుకొని రాగలడు?

కూర్మావతారం అయితే మందర పర్వతాన్ని సముద్రం లోపలకు ముంచి వేస్తున్నది. సంసార భారంతో అడుగున పడి ఉన్న మనలను ఆ స్వామి ఏ విధంగా ఉద్ధరించగలడు?

నరసింహ మూర్తిని చూస్తే కంఠానికి పైన ఒక రూపాన్ని, కింద ఒక రూపాన్ని కలిగి ఉంటాడు. అందువల్ల అతని మాటలలో మనకు సందేహం కలుగుతున్నది.

వామనమూర్తి మొదట చిన్న పాదాన్ని చూపించి, తరువాత పెద్ద పాదంతో భూమిని కొలిచాడు. అందువల్ల అతని విషయంలో మనకు నమ్మకం లేదు.

ఇక పరశురాముని చూస్తే, అతడు కోపిష్టి వాడు. మన్నించడం అనే విషయాన్ని ఏ మాత్రం తెలియనివాడు. ఆ స్వామిని దర్శించినప్పుడు మనకు కలిగిన భయం వల్ల అతని దగ్గరకే పోలేము.

శ్రీ రాముడు వానరులతో కలసి సంచరించేవాడు. పుణ్యంకోసం కాచుకుని ఉండే మనం ఆ స్వామిని ఆశ్రయించ లేము.

బలరాముడు సదా మద్యపానం చేస్తూ ఉంటాడు. అందువల్ల మన దారిలోకి అతడు రాడు.

శ్రీకృష్ణుడు గోదాదేవి పలికినట్లుగా అసత్యాలు చెప్పేవాడు.

కల్కి ఇకపైన జన్మించబోతాడు. అందువల్ల అతని మనం ఏవిధంగా దర్శించగలం?

ప్రళయకాలంలో సముద్రంలో మునిగి పడిఉండే భూదేవిని ఉద్ధరించిన పుణ్యమూర్తి వరాహస్వామియే, ఈ భూమిపై ఉండే మనలను ఉద్దరించగలడు. అందుచేత ఆ స్వామిని ఆశ్రయించండి — అని భట్టర్ అన్నారు.



**శ్రీ లక్ష్మీవరాహ స్వామి – మేల్కోట**

**<u>శ్రీవేదాంతదేశికుల శ్రీసూక్తి:</u>**

శ్రీ వేదాంతదేశికులు దశావతార స్తోత్రంలో వరాహావతారాన్ని **"గోపాయేదనిశం జగంతి కుహనాపోత్రీ పవిత్రీకృత బ్రహ్మాండ ప్రళయోర్మిఘోషగురుభిః ఘోణారవైః ఘుర్ఘురైః"**(4) అనే

చాలా అద్భుతమైన రీతిలో కీర్తించారు. `వరాహస్వామి ముక్కునుండి బయటకు వచ్చే, ప్రళయకాలంలోని సముద్రపు అలల ధ్వనులవంటి ఘుర్ఘురధ్వని బ్రహ్మాండాన్ని పవిత్రం చేస్తున్నది' అని అన్నారు. వేదాలను అభ్యసించి మనలను పవిత్రం చేసికోవడం కష్టం. వేద ప్రతిపాద్యుడైన శ్రీవరాహస్వామి ధ్వనితో మనం పవిత్రులం కావడం సులభం కదా! అంతేకాక, భూస్తుతిలో **"ఆశ్వాసనాయ జగతామ్"** (14) అనే శ్లోకంలో దేశికులు "ఆపదల నుండి భక్తులను రక్షించేవాడను నేను ఒక్కడనే" – అని భగవంతుడు లోకానికి తెలియజేయాలని అనుకున్నప్పుడు భూదేవి అతనికి సహాయపడడంకోసం సముద్రంలో మునిగింది" – అని అన్నారు. ఇందువల్ల కూడా ఆపదలలో రక్షించేవాడు వరాహస్వామి ఒక్కడే అని చెప్పినట్లు అయినది.

వరాహస్వామి భూదేవికి చేసిన గొప్ప ఉపదేశమే వరాహ చరమ శ్లోకం. ఇందులో **"స్థితే మనసి"** ఇత్యాదిగా రెండు శ్లోకాలు ఉన్నాయి. శ్రీదేశికులు ఈ రెండు శ్లోకాలను 'రహస్య శిఖామణి' అనే రహస్య గ్రంథంలో వ్యాఖ్యానించారు. అందులోని ఉపోద్ఘాతంలో దేశికులు వరాహస్వామి గొప్పతనాన్ని వివరంగా తెలిపారు.

శ్రీ వైకుంఠంలో ఉండే పరమపదనాథుడు సంసార సముద్రాన్ని దాటి తన దగ్గరకు వచ్చినవారికి మాత్రమే తన గుణాల అనుభవాన్ని కలిగిస్తాడు. వరాహస్వామి అయితే బలహీనులు కూడా సంసార సముద్రంలో మునిగిపోకుండా ఉండేటట్లు వారిని ఉద్ధరించి కాపాడతాడు.

పాలసముద్రంలో ఉండే వ్యూహవాసుదేవుడు ఉన్నతమైన స్థానంలో ఉంటాడు. దీనికి విరుద్ధంగా వరాహస్వామి తన వాత్సల్యం, సౌలభ్యం స్పష్టం అయ్యేటట్లు తక్కువ స్థానంలో ఉంటాడు.

మత్స్యం నీటిలో సంచరించే తన సంతానాన్ని తన చూపు ద్వారా రక్షిస్తుంది. మత్స్య రూపాన్ని ధరించిన భగవంతుడు కూడా ఈ లోకంలో ఉండే తన భక్తులను తన కటాక్షంతో రక్షిస్తాడు. కానీ, వరాహస్వామి "మరణశయ్యపై పని ఉండి, ఏమాత్రం దేనినీ స్మరించలేని స్థితిలో ఉండే భక్తుని కేవలం నా సంకల్పంతోనే రక్షిస్తాను" – అని అన్నాడు.

పాల సముద్రాన్ని చిలికినప్పుడు అందులో కవ్వంగా పెట్టి చిలికిన మందర పర్వతాన్ని భగవంతుడు కూర్మ రూపంతో దానిని తన వీపుపై ధరించాడు. వరాహస్వామి అయితే, సముద్రంలో మునిగిన భూమిని, దానిని ధరించిన పర్వతాలను కూడా కలిపి తన కోరదంతంతో ఉద్ధరించి రక్షించాడు.

నరసింహస్వామి భూమిలో ఏదో ఒకచోట నాటబడిన స్తంభాన్ని బ్రద్దలు చేశాడు. వరాహస్వామి భూమిని అంతటిని పాడు కాకుండా ఉద్ధరించి రక్షించాడు.

వామనమూర్తి వంచన బుద్ధితో, తన అందమైన చేతితో మహాబలి దానం ఇచ్చిన తన భూమిని పొందాడు. వరాహస్వామి అయితే, ఋజువైన బుద్ధితో అసురుడైన హిరణ్యాక్షుని వధించి, తన భూమిని తానే పొందాడు.

పరశురాముడు విరోధులను వధించడం కోసం 'పరశువు' అనే చిన్న ఆయుధాన్ని సాక్షిగా చేసికొన్నాడు. వరాహస్వామి విరోధిని నశింపజేయడం కోసం భూమండలాన్ని సాక్షిగా చేసికొన్నాడు.

శ్రీరాముడు తన అవతారాన్ని చాలించేటప్పుడు భూమిలో ఉండే చరాచరాలను అన్నిటిని వైకుంఠానికి చేర్చాడు. వరాహస్వామి అయితే భూమిని తన బాహువులలో ధరించడం తన అవతారానికి ప్రయోజనంగా గ్రహించాడు.

బలరాముడు భూమిని నాగలితో గుచ్చి, దానికి హాని కలిగించే ఒకానొక కార్యాన్ని చేశాడు. వరాహస్వామి భూమి బ్రద్దలు కాకుండా ఉండడంకోసం సహజంగా తన శరీరంలో పొందికగా ఉండే కోర దంతంతో ఆ భూమిని మృదువుగా ధరించాడు.

గీతాచార్యుడు అర్జునునకు ఉపదేశించిన గీతలో మొదట కష్టమైన కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగాలను తెలియజేసి, చివరలో సులభమైన శరణాగతిని ఉపదేశించాడు. వరాహస్వామి ఆ విధంగా కాకుండా, ప్రారంభంలోనే సులభంగా చరమ శ్లోకాలను రెండిటిని ఉపదేశించాడు.

కల్కి అవతారం రాబోయే కాలంలోనే సహాయపడుతుంది. వరాహస్వామి ముందుకాలంలోనే భూమిని రక్షించి సహాయపడ్డాడు.

ఈ విధమైన కారణాలవల్ల మన రక్షణ కోసంగానే అవతరించిన వరాహస్వామియే అందరికీ ఆశ్రయించదగినవాడు – అనే విషయంలో ఏ సందేహం లేదు.

**వరాహనామ పర్యాయపదాలు:**

అమరకోశం అనబడే సంస్కృత నిఘంటువులో వరాహ శబ్దానికి కొన్ని పర్యాయపదాలు ఇవ్వబడ్డాయి. ఇవి అన్నీ వరాహస్వభావాలను తెలియజేస్తాయి. అమరకోశంలో **"వరాహః సూకరో ఘృష్టిః కోలః పోత్రీ కిరిః కిటిః, దంష్ట్రీ ఘోణీ స్తబ్ధరోమా క్రోడో భూదార ఇత్యపి"** అని వరాహాన్ని తెలిపే కొన్ని నామాలు ఉన్నాయి. వీటి అర్థం ఇప్పుడు తెలుపబడుతున్నది.

**వరాహః** — వరం, అంటే గొప్ప క్షేత్రమైన భూమి. దీనిని, ఆహంతి — తిరిగి తీసుకొని వచ్చినవాడు – అని అర్థం. భూమిని ఉద్ధరించినవాడు – అని తాత్పర్యం. వరమైన అహస్సును, అంటే, దినాన్ని కలిగించేవాడు తన దర్శనంతో, తన సూక్తులతో, మనకు మంచి దినం కలిగేటట్టుగా చేసేవాడు – అని కూడా అర్థం చెప్పవచ్చు. వరాహస్వామి దర్శనంవల్ల, సూక్తుల వల్ల, మనకు మంచి కాలం కలుగుతుంది కదా! అంతేకాక, **"నయామి పరమాం గతిమ్"** అని 'ఉత్తమగతికి తీసుకుని పోతాను' అని పలికినవాడు వరాహస్వామి. అందుచేత ఉత్తమగతిని పొందే దినం వరాహస్వామి వల్ల కదా కలుగుతుంది.

**సూకరః** — సంతానాన్ని ఎక్కువగా ప్రసవించేవాడు అని అర్థం. ఆదివరాహస్వామి లోకానికి మూలకారణం కదా. "భూమిని ఉద్ధరించడం ఎంతపని? ఇది సుకరం సుకరం" – అని అన్నాడు గనుక సూకరుడు అయ్యాడు అని కూడా పెద్దలు చమత్కారంగా ఈ నామానికి అర్థం చెబుతారు.

**ఘృష్టిః** — ఉన్నతమైన ప్రదేశాలను తన కోరతో తవ్వి సమంగా చేసేవాడు అని అర్థం. తనలో ఉండే పరత్వాన్ని తగ్గించుకుని, చాలా తక్కువ జాతిలో స్వామి అవతరించాడని ఈ పదం సూచిస్తుంది – అని చెప్పవచ్చు

**కోలః** — గొప్ప శరీరాన్ని కలవాడు అని అర్థం. మహావరాహః అని శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రం, వరాహస్వామి పెద్ద రూపాన్ని కలవాడని తెలిపింది.

**పోత్రీ** — పొడుగుగా ఉండే ముఖాగ్రాన్ని కలిగినవాడు అని అర్థం.



**శ్రీ శ్వేతవరాహ స్వామి – మైసూరు**

**కిరిః** — ముఖంతో భూమిని తవ్వేవాడు అని అర్థం. ఇది కూడా భూమిని ఉద్ధరించిన విషయాన్ని తెలుపుతున్నది.

**కిటిః** — యథేచ్ఛంగా విహరించేవాడు అని అర్థం.

**దంష్ట్రీ** — అందమైన కోరదంతాన్ని కలిగినవాడు – అని అర్థం. ఈ విషయాన్ని ఋషులు, ఆళ్వార్లు వరాహావతారాన్ని వర్ణించేటప్పుడు ప్రస్తావించారు.

**ఘోణీ** — దీర్ఘమైన ముఖాన్ని కలిగినవాడు అని అర్థం. ఇది కూడా వరాహస్వామికి కల ముఖ సౌందర్యాన్ని తెలుపుతుంది.

**స్తబ్ధరోమా** — బిరుసుగా ఉండే కేశాలను కలిగినవాడని అర్థం. "కేళ్ల్ ఒన్ఱాకి ఇడంద కేశవన్" ( అద్వితీయమైన వరాహమై, భూమిని ఉద్ధరించిన కేశసౌందర్యం గల స్వామి) అని ఆళ్వార్లు వరాహస్వామి కేశ సౌందర్యాన్ని కీర్తించారు.

**క్రోడః** — గొప్పవాడు అని అర్థం. వరాహ స్వామి రూపంలోను, స్వభావంలోను గొప్పవాడు కదా.

**భూదారః** — భూమిని తవ్వేవాడు అని అర్థం. భూమిని ఉద్ధరించాడు కదా వరాహస్వామి.

ఈ విధంగా వరాహ పర్యాయ పదాలు అన్నీవరాహస్వామి వైభవాన్ని సూచిస్తున్నాయి.

## శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రంలో వరాహస్వామి నామాలు:

జగత్ ప్రసిద్ధమైన శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రంలో వరాహ వైభవాన్ని తెలిపే నామాలు నాలుగు కనిపిస్తున్నాయి. **"మహాశృంగః, కృతాంతకృత్, మహా వరాహః, గోవిందః"** అనే ఈ నాలుగు నామాలు 540, 541, 542, 543వ నామాలుగా ఆ స్తోత్రంలో చోటుచేసుకున్నాయి. ఈ నాలుగు నామాలు వరాహస్వామిలోని నాలుగు విధాలైన గొప్పతనాలు కీర్తిస్తున్నాయి. వీటిని చాలా అందంగా పరాశర భట్టర్ వ్యాఖ్యానించారు.

**మహాశృంగః** – ఈ నామానికి గొప్ప కొమ్మును కలవాడు – అని అర్థం. ఈ నామం వరాహ స్వామికి కల కోరదంతంలోని వైభవాన్ని తెలుపుతున్నది. వరాహస్వామి ప్రళయ సముద్రంనుండి

భూమిని తన కోర దంతంతో గుచ్చి ఉద్ధరించినప్పుడు, ఆ దంతం చివరలో లగ్నమైన భూమిని కలవాడై, పద్మాలతో కూడిన సరస్సులో దిగి, అందులోని బురదతో పాటు పచ్చని తామరాకులు తన దంతానికి తగిలించుకొన్నట్లు ఉన్నాడు అని భాగవతం **"దంష్ట్రాగ్రవిన్యస్తమశేషమేతద్భూమండలం...పద్మవనం విలగ్నం సరోజినీపత్రమివోఢపంకజమ్"** అనే శ్లోకం ద్వారా పలికింది. ఈ అందమైన సన్నివేశాన్ని నమ్మాళ్వార్లు తిరువాయ్ మొళ్ళి ప్రబంధంలో **"కోల వరాకమొన్రాయ్ నిలమ్ కోట్టిడైక్కొండ ఎందాయ్"** (అందమైన వరాహ రూపాన్ని కలవాడవై, భూమిని దంతం చివర గ్రహించినవాడవైన నా తండ్రీ!) అని వర్ణించారు. నామం కోలవరాహస్వామి రూపాన్ని తెలుపుతుంది.

**కృతాంతకృత్** – 'ఈ నామానికి యమునివంటి హిరణ్యాక్షుడు అనే అసురుని సంహరించినవాడు' – అని, 'తాను ఉపదేశించిన వరాహ చరమ శ్లోకంలో అందమైన నిర్ణయాన్ని చేసినవాడు' – అని రెండు అర్థాలను భట్టర్ తెలియజేశారు. **"ఏనత్తినురువాకి నిలమంగైఎళ్ళిల్ కొండాన్....ఞానత్తిన్ ఒళియురువై నినైవార్ ఎన్ నాయకరే "** (పెరియ తిరుమొళ్ళి 2–6–3) (వరాహరూపుడై భూదేవి అందాన్ని ఆస్వాదించిన జ్ఞానప్రకాశ రూపుడు) అని ఈ అర్థాలను తిరుమంగై ఆళ్వార్లు అనుసంధించారు. ఇక్కడ అసురవధ స్పష్టంగా తెలుపబడకపోయినా, భూదేవిని ఉద్ధరించిన వృత్తాంతం ద్వారా ఇది సూచింపబడింది. నమ్మాళ్వార్లు కూడా వరాహస్వామిని 'తిరువిరుత్త' ప్రబంధంలో 'జ్ఞానప్పిరాన్' అని నిర్దేశించి, ఆ స్వామి యథార్థమైన జ్ఞానాన్ని వరాహచరమశ్లోకం అనుగ్రహించడం ద్వారా ప్రసాదించాడు అనే విషయాన్ని తెలియజేశారు. ఈ నామం ఈ విధంగా జ్ఞానవరాహస్వామి రూపాన్ని తెలుపుతుంది.

**మహావరాహః** – 'గొప్ప వరాహరూపాన్ని కలవాడు' అని ఈ నామానికి అర్థం. వరాహస్వామియొక్క గొప్ప రూపాన్ని శ్రీవిష్ణుపురాణం, భాగవతం మొదలైన గ్రంథాలు అందంగా వర్ణించాయి. భట్టర్ ఈ సందర్భంలో **"తతః సముత్ క్షిప్య ధరాం....నీల ఇవాచలో మహాన్"** అనే విష్ణుపురాణంలోని శ్లోకాన్ని ఉట్టంకించారు. ఈ వరాహరూప సన్నివేశాన్ని ఆళ్వార్లు కూడా **"శిలంబినిడై శిఱుపరల్ పోల్"** (పెరియ తిరుమొళ్ళి–4–4–8) ఇత్యాది పాశురాలలో

అనుభవించారు. ఈ విషయంలో ఇంకా కొన్ని వివరాలు ముందు ప్రస్తావింపబడతాయి. ఈ నామం మహావరాహస్వామి రూపాన్ని తెలుపుతుంది.

**గోవిందః** – అసురునిచే అపహరింపబడిన భూమిని ఉద్ధరించి, తిరిగిపొందినవాడని అర్థం. ఇక్కడ భట్టర్ ఈ అర్థాన్ని తెలిపే "నష్టాం చ ధరణీం పూర్వమవిందం చ గుహాం గతామ్, గోవింద ఇతి తేనాహమ్" అనే మహాభారత శ్లోకాన్ని ఉదాహరించారు. ఈ నామం భూవరాహస్వామి రూపాన్ని తెలుపుతుంది.

ఈ నామాలే కాక, **"త్రిపదః, త్రిదశాధ్యక్షః"** (538, 539) అనే నామాలు కూడా వరాహస్వామిని తెలుపుతున్నట్లుగా చెప్పవచ్చు. భట్టర్ **"త్రిపదః**" అనే నామానికి వ్యాఖ్యానం చేస్తూ, "మూడు మూపురాలను మూడు చోట్ల కలవాడను కనుక నేను వరాహరూపాన్ని పొందాను" అని భగవంతుడు పలికిన ఒక పాంచరాత్రాగమ వాక్యాన్ని ఇక్కడ భట్టర్ ఉదాహరించి, ఈ నామం వరాహస్వామిని తెలుపుతున్నదని సూచించారు. ఆ విధంగానే **"త్రిదశాధ్యక్షః"** అనే నామాన్ని వివరించేటప్పుడు, "బ్రహ్మ మొదలైన దేవతలకు ఆపదలలో అండగా నిలిచినవాడు కనుక ఈ నామాన్నివరాహస్వామి పొందాడు" అనే అర్థం వచ్చేటట్లుగా పలికారు. సృష్టిసమయంలో హిరణ్యాక్షుని వల్ల బ్రహ్మ మొదలైన దేవతలకు కలిగిన ఆపదను వరాహ స్వామి తీర్చాడు కదా.

**ఆదివరాహస్వామి:**

బ్రహ్మ సృష్టి చేసిన సమయంలో ప్రారంభంలోనే వరాహావతారాన్ని ఎత్తినందున, ఆదికారణంగాను, లోకానికే కారణం అయినందున, 'ఆదివరాహస్వామి' అని ఆ రూపం కీర్తించబడుతున్నది. 108 దివ్యదేశాలలో ఒకటి, ఋగ్వేదంలో ప్రస్తావించబడినది అయిన తిరుమల చాలా ప్రాచీనమైనది. దానికి ఆదివరాహ క్షేత్రమని పేరు. భగవంతుడు కృతయుగంలోనే వరాహస్వామిగా అవతరించి, హిరణ్యకశిపుని సంహరించిన తరువాత విశ్రాంతి తీసుకోవాలని తలచి ఏకాంతమైన ఒక అందమైన చోటును వెదకి తిరుమలను తన నివాసస్థానంగా

చేసికొన్నాడు. తరువాత చాలాకాలం గడిచిన పిమ్మట, కలియుగంలో శ్రీనివాసస్వామిగా తిరుమలకు వచ్చి అక్కడ తపస్సు చేసుకోవాలని తలచి, అందుకు వరాహస్వామి అనుమతిని పొందాడు. కొంచెం చోటు ఇస్తే తరువాత ఊరిని అంతటినీ ఆక్రమిస్తాడు – అని తెలిసికొని ఒక నియమంతో వరాహస్వామి తన అంగీకారాన్ని తెలియజేశాడు. తిరుమలలో అన్నీ తన తనకే ముందు జరగాలి అనే ఒక నియమాన్ని వరాహస్వామి విధించాడు. దానికి శ్రీనివాసుడు అంగీకరించాడు. అందువల్లనే ఈ నాటికీ తిరుమలలో ప్రతిదినం ఉదయ కాలంలో ఆరాధన, నివేదన మొదలయినవి అన్నీ మొదట వరాహస్వామికి జరుగుతున్నాయి. భక్తులు కూడా మొదట వరాహస్వామిని సేవించి, ఆ తరువాతే శ్రీనివాసుని దర్శించడం ఒక సంప్రదాయంగా వస్తున్నది. "శ్రీనివాసుడు తిరుమలలో అద్దెకు ఉన్నవాడు" – అనే అర్థం వచ్చేటట్లుగా నమ్మాళ్వార్లు తిరువాయ్ మొ**ழி** ప్రబంధంలో **"పరన్ శెన్రుశేర్ తిరువేంగడమామలై"** అని పలికారు.



**శ్రీవరాహస్వామి – తిరుమల**

తిరుమల ఆది వరాహస్వామి క్షేత్రం అనే విషయాన్ని పేయాళ్వార్లు తమ ప్రబంధంలో **"వేంగడమే మున్నొరునాళ్ మణ్ కోట్టుక్కొండాన్ మలై"** (వేంకటాచలం పూర్వం ఒక సమయంలో భూమిని తన దంతంపై ధరించిన వరాహస్వామి వేంచేసి ఉండే క్షేత్రం) అని అనడం ద్వారా సూచించారు. ఇప్పుడు మనం జీవించే కాలం 'శ్వేతవరాహ కల్పం'. కల్పం అంటే బ్రహ్మ ఆయుస్సులో ఒక భాగం. శ్వేతం అంటే తెలుపు. ఈ కల్పం వరాహస్వామి కల్పం. శ్వేతవరాహ రూపంలో భగవంతుడు **'తిరువెళ్ళత్తై'** అనే దివ్యదేశంలో మనకు దర్శనం ఇస్తున్నాడు. ఈ క్షేత్రం శ్రీరంగం కంటే చాలా ప్రాచీనమైనది అని స్థలపురాణం తెలుపుతున్నది. ఇక్కడ భగవంతుడు శ్వేతవరాహమూర్తిగా అవతరించడానికి ఒక కారణం పురాణంలో చెప్పబడింది.

శ్రీ రాముని కంటే ముందు ఈ భూమిని పరిపాలించిన శిబి చక్రవర్తి ఒకానొక పర్యాయం తన సైన్యంతో తిరువెళ్ళత్తై దగ్గర విడిది చేశాడు. అప్పుడు ఒక శ్వేత వరాహం అతని సైనికులకు కనిపించింది. దానిని వారు వెంబడించి తరుమగా, అది ఒక పొదలో దూరి, మాయమైనది. దానిని చూసి ఆశ్చర్యపడిన చక్రవర్తి సమీపంలో తపస్సు చేసికొనే మార్కండేయ మహర్షిని చూచి ఆ వరాహం గురించి అడిగాడు. అప్పుడు ఆ ముని చెప్పిన రీతిలో వరాహం దూరిన పొదకు పాలతో అభిషేకం చేశాడు. వెంటనే అక్కడ భగవంతుడు శ్వేతవరాహ రూపంలో దర్శనం ఇచ్చాడు. ఈ విధంగా ఆదివరాహస్వామి అవతరించిన చోటు కనుక, ఈ క్షేత్రం 'ఆది తిరువెళ్ళత్తై' అని పిలువబడుతున్నది.

తిరుమంగై ఆళ్వార్ 'పెరియ తిరుమొళి' ప్రబంధంలో (5-3-5) **"మణ్ మకళ్ అళుంగ మున్నీర్ ప్పరప్పిల్ ఏనమాకి యన్ఱిరునిల మిడందవనే....తిరువెళ్ళత్తై నిన్ఱానే"** అని తిరువెళ్ళత్తై క్షేత్రంలో వేంచేసి ఉండేవాడు పూర్వకాలంలో భూమిని ప్రళయ సముద్రంనుండి ఉద్ధరించిన స్వామి – అని తెలియజేశారు.

శ్రీ విష్ణుపురాణం, శ్రీ భాగవతంలో భగవంతుని అవతారాలు క్రమంగా ప్రస్తావించే సందర్భంలో మొదట వరాహ అవతారమే ప్రస్తావింపబడింది. తిరుమంగై ఆళ్వార్ 'తేర్

అఱ్ఱున్దూర్' అనే క్షేత్రాన్ని కీర్తించేటప్పుడు, **"ఎంబెరుమాన్ ఉంబర్ అఱ్ఱుమ్ అరశనే! ఆదివరాకమున్నానాయ్"** (పెరియతిరుమొழி—7—7—4) "వరాహస్వామి కల్పం ప్రారంభంలోనే ఆవిర్భవించాడు" – అని తెలిపారు. అంతేకాక, దశావతారాలను ప్రస్తావించే పాశురంలో ఆ అఴ్వార్లు వరాహస్వామిని వర్ణిస్తూ **"ఉలకేழிనోడుముడనే ———ఆదిమున్ ఏనమాకి అరణాయ మూర్ త్తి"** (పెరియ తిరుమొழி-11 —4—3) అని అనడం ద్వారా సప్తకుల పర్వతాలు, సముద్రాలు తన గిట్టలలో అణగి ఉండేటట్లు పెరిగిన గొప్ప రూపాన్ని కల వరాహస్వామియే లోకానికి కారణం అని అన్నారు. శ్రీవిల్లిపుత్తూరు, తంజమామణి క్కోయిల్, తిరుక్కురుకూర్ మొదలైన దివ్యక్షేత్రాలు కూడా ఆది వరాహక్షేత్రాలుగానే కీర్తింపబడుతున్నాయి.

**మహావరాహస్వామి:**

భగవంతునకు కల అనేక నామాలలో 'లోకాలను అన్నిటిని వ్యాపిస్తున్నాడు' అని అర్థం వచ్చే విష్ణునామం ముఖ్యమైనది. పరమాత్మను నిర్దేశించే బ్రహ్మ శబ్దానికి 'చాలా పెద్దవాడు' అని అర్థం. తన సహజమైన స్వభావాలతో, గుణాలతో, రూపాలతో చాలా గొప్పవాడు అనే విషయాన్ని తెలియజేయడం కోసం పరమాత్మ అయిన విష్ణువు, వరాహమై, ఇంత అని చెప్పడానికి సాధ్యం కాని పెద్ద రూపాన్ని ధరించాడు. దర్శించేవారి కన్నులను, మనస్సును ఆశ్చర్యపరిచే అతని రూపాన్ని చూడగానే మహర్షులు, ఆఴ్వార్లు చాలా అద్భుతమైన సూక్తులను వెలువరించారు.

శ్రీ విష్ణు పురాణంలో పరాశర మహర్షి స్వామిని వర్ణించేటప్పుడు **"సామస్వరధ్వనిః శ్రీమాన్ జగర్జ పరిఘర్ఘరమ్, తతః సముత్క్షిప్య ధరాం స్వదంష్ట్రయా మహావరాహః స్ఫుటపద్మలోచనః, రసాతలాదుత్పలపద్మసన్నిభః సముత్థితో నీల ఇవాచలో మహాన్"** (వరాహస్వామి తన గర్జనలతో సామవేద ధ్వనిని చేస్తూ, తన కోర దంతం చివర భూమిని ధరించి, పాతాళలోకంలో నుండి నీలోత్పలం ఆకు రంగు వంటి నీలవర్ణాన్ని కలవాడై, గొప్ప రూపంతో బయటకు వచ్చాడు) అని అన్నారు. ఇక్కడ ఈ సూక్తి లో ఉండే **"మహా వరాహః స్ఫుటపద్మలోచనః"** అనే ప్రయోగంలోని అర్థాన్ని నమ్మాఴ్వార్లు తిరువిరుత్త ప్రబంధంలో **"పెరుమ్ కేழలార్ తమ్ పుండరీకమ్"** (45)

(గొప్ప తామర వంటి నేత్రాలను కల వరాహస్వామి) అని పలికారు. వీరిద్దరూ "అందరికంటే వరాహస్వామి గొప్పవాడు" అని, "అతడు తామర వంటి కన్నులు కలవాడు" అని అన్నారు. సంస్కృతంలో, ద్రావిడంలో ఈ విధంగా ఏకకంఠంతో చెప్పినందున మన శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఉభయవేదాంతాలు రెండు కన్నులుగా కీర్తింపబడుతున్నాయి.

వరాహస్వామి రూపంలోని గొప్పతనాన్ని, పరిమాణాన్ని ఇంకొక శ్లోకంలో మహర్షి **"ఖురమధ్యగతో యస్య మేరుః కణకణాయతే"** (వరాహస్వామి గిట్టలలో చిక్కుకొన్న మేరు పర్వతం చిన్న నిప్పు కణిక వలె తోచింది – అని సంస్కృతంలో పలికిన అర్థాన్ని తిరుమంగై ఆళ్వార్ **'తిరుత్తెర్ర్రి అంబలమ్'** అనే క్షేత్రాన్ని వర్ణించేటప్పుడు **"శిలంబినిడై శిఱు పరల్ పోల్ పెరియమేరు తిరుక్కుళంబిల్ కణకణప్ప త్తిరువాకారమ్ కులుంగ, నిలమడందైతనై ఇడన్దు పుల్ కి క్కోట్టిడై వైత్తరుళియ ఎన్ కోమాన్ కండీర్"** (వరాహస్వామి తన గిట్టలోని మంజీరమనే ఆభరణంలో చిక్కుకున్న చిన్న రాయి వలె మేరుపర్వతం ప్రకాశించగా, వక్షః స్థలంలో ఉండే మహాలక్ష్మి కదలాడగా, భూదేవిని ఉద్ధరించి, తన కోర దంతంతో ఎత్తి, మాణిక్యం పొదిగినట్లుగా పెట్టుకున్నాడు. అతడే మనకు స్వామి) అని అన్నారు.

ఎంతో పెద్దది అయిన మేరు పర్వతంకూడా వరాహస్వామిగిట్టలో చిన్న రాయి వలె చిక్కుకోవాలంటే ఆ స్వామి రూపం ఎంత పెద్దదో మనం ఊహించడానికి సాధ్యం కాకుండా ఉంటుంది కదా! అటువంటి విధంగా వరాహ స్వామి పెద్ద రూపాన్ని ధరించవలసిన అవసరం ఏమి వచ్చింది? – అనే విషయాన్ని పలు విధాలుగా పెద్దలు వ్యాఖ్యానించారు.

ఒక వస్తువును మనం ధరించేటప్పుడు, ఆ వస్తువు మనతో పోలిస్తే అది మన కంటే ఎంతో చిన్నది గాను, మనం దాని కంటే ఎంతో పెద్దవారంగా ఉండాలి! అప్పుడే ఎంతో సులభంగా, అనాయాసంగా ఆ వస్తువును మనం ధరించవచ్చు. ఆ వస్తువు కూడా అప్పుడే కదలకుండా, మెదలకుండా ఉంటుంది. వరాహస్వామి భూమిని ధరించేటప్పుడు ఆ భూమి కంటే ఎన్నో రెట్లు పెద్ద రూపాన్ని ధరించినవాడు అయినప్పుడే, దానిని అతడు ధరించగలడు. అప్పుడే, భూమి కూడా

కదలకుండా మెదలకుండా ఉంటుంది. ఈ విషయాన్ని నమ్మాళ్వార్లు ఎంతో మనోహరంగా తిరువాయ్ మొళ్ళి ప్రబంధంలోని ఈ క్రింది పాశురంలో తెలియజేశారు:

**నాన్గిలవేళ్ళ మణ్ణుమ్ తానత్తవే, పిన్నుమ్**
**నాన్గిల ఏళ్ళ మలై తానత్తవే, పిన్నుమ్**
**నాన్గిల ఏళ్ళ కడల్ తానత్తవే, అప్పన్**
**ఊన్గి ఇడందు ఎయిఱ్ఱిల్ కొణ్డనాళే** (7—4—3)

వరాహస్వామి భూమిని ఎత్తి ధరించినపుడు, భూమి రేణువులు కూడా కదలలేదు. పర్వతాలు కూడా చలించలేదు. సముద్రంలోని నీరు కూడా కలత పొందలేదు. ఆ విధంగా భూమిని పువ్వువలె ఎత్తి, తన కోర దంతంతో ధరించాడు — అని దీని భావం.

ఇది అంతా భూమిని, దానిపై నివసించే మనలను కాపాడడంలో వరాహస్వామి కల ఆసక్తి ఎంత గొప్పదో తెలియజేస్తున్నది. దీనిని గమనిస్తే మన ఒళ్ళు ఆనందంతో, ఆశ్చర్యంతో జలదరిస్తుంది కదా!

వరాహమూర్తి ఈ విధంగా చాలా పెద్ద రూపాన్ని ధరించడంలో ఇంకొక కారణం కూడా ఉన్నది. మన బంధువులను విందు కోసం మనం మన ఇంటికి ఆహ్వానిస్తే, వారు సంఖ్యలో నలుగురే అయినా, వారు చాలా తక్కువ భుజించేవారు అయినా, మనం పదిమంది భుజించే పరిమితికి వంటను సిద్ధం చేస్తాము కదా. ఇది విందును ఇచ్చేవారి మనసులోని గొప్పతనాన్ని సూచిస్తుంది. ఆ విధంగానే వరాహస్వామికి తన భక్తులను రక్షించడంలో ఉండే పేరాశ కారణంగా అవసరం అయిన దానికంటే ఎన్నో రెట్లు పెద్ద రూపాన్ని అతడు ధరించాడు.

వరాహస్వామి ధరించిన పెద్ద రూపాన్ని గమనించినప్పుడు, "అతని భక్తులమైన మనం చాలా గొప్పవానిని మనం ఆశ్రయిస్తున్నాము; అందువల్ల పర్వతాల వంటి మన కర్మలు అడ్డురావు,

మంచువలె కరిగిపోతాయి" అనే నమ్మకం మనకు కలుగుతుంది. మనకు తగిన గొప్ప రక్షణ ఈ వరాహస్వామియే అనే దానికి ఈ విషయం ఒక్కటి చాలు కదా.

**యజ్ఞవరాహస్వామి:**

యంత్రంవలె నిరంతరం పరిభ్రమించే ఈ లోకంలో మనకు ఆశ్వాసం కలిగించేది భక్తిమార్గం ఒక్కటే. నిజమైన ప్రేమతో భగవానుని నమస్కరించి ఆశ్రయించడమే భక్తి. భగవంతుని పూజించడం భక్తిలో ముఖ్యమైన అంగాలు – హోమం, తపస్సు, పూలను సమర్పించడం అనేవి. ఇవి అన్నీ భగవంతుని పూజించడం కోసం చేయబడేవే. భగవంతునకు సేవ చేసే ఈ కార్యాలతో మనం అనాదికాలంగా చేసే కర్మలు తొలగిపోతాయి. **"యజ"** అనే ధాతువునకు "దేవుని పూజించడం" అని అర్థం. యాగం, యజ్ఞం అంటేనే దేవ పూజ అని అర్థం .ఫలంలో అపేక్ష లేకుండా, నేను చేస్తున్నాను అనే భావన లేకుండా భగవంతునకు సేవ చేయడమే గొప్ప. ఇక్కడ ఒక సందేహం కలుగవచ్చు. మనం చేసే పనిని ఏ విధంగా "దీనిని మనం చేయలేదు, భగవంతుడే దీనిని చేయిస్తున్నాడు" అని నమ్మడానికి వీలవుతుంది? – అనేది ఆ సందేహం. ఈ సందేహాన్ని భగవద్గీతలో శ్రీకృష్ణుడు తీర్చాడు. **"ఆహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ"** (నేనే అన్ని యజ్ఞాల ఫలాలను భుజించేవాడను. యజ్ఞాలకు యజమానిని. ఆ యజ్ఞాల వల్ల కలిగే ఫలాన్ని ఇచ్చేవాడను నేనే) అనే గీతావచనాన్ని ఇక్కడ స్మరించాలి.

యజ్ఞాలు, వాటిని చేసే మనం అంతా ఆ భగవంతుని సొత్తే. వాటిని చేయాలి అనే అభిప్రాయాన్ని కలిగించేవాడు కూడా అతడే. ఈ విధంగా ఉన్నప్పుడు "ఈ పనిని మనం చేశాము" అని మనం భావించే అవకాశమే లేదు. దీనిని గీతలో స్పష్టంగా శ్రీకృష్ణుడు తెలియజేశాడు. గ్రంథాల వల్ల ఒక విషయాన్ని గ్రహించి తెలుసుకోవడం కష్టం. సాక్షాత్తూ చూసి తెలుసుకోవడం సులభం. అందుచేత, వరాహస్వామి తన పెద్ద రూపంతో "తానే అన్నివిధాలైన యాగాలు యజ్ఞాలు" అని తన అవతార సమయంలో తెలిపాడు. తనను యజ్ఞవరాహరూపునిగా మహర్షులకు దర్శనం ఇవ్వగా, ఆ రూపాన్ని వారు తమ మనసులో ముద్రించుకుని, దానిని మనకు

గ్రంథాలలో తెలియజేశారు. శ్రీ విష్ణుపురాణంలో పరాశర మహర్షి **"పాదేషు వేదా స్తవ యూపదంష్ట్ర! దంతేషు యజ్ఞాశ్చితయశ్చ వక్త్రే, హుతాశజిహ్వోసి తనూరుహాణి దర్భాః ప్రభో! యజ్ఞపుమాన్ త్వమేవ"** (1—4—32) అని ఆరంభించి యజ్ఞవరాహస్వామి మూర్తిని వర్ణించాడు. వరాహస్వామి నాలుగు పాదాలు నాలుగు వేదాలు. అతని కోర దంతం యాగానికి యూపస్తంభం. యాగంలో సమర్పింపబడే హవిస్సును భుజించే అతని దంతాలు యాగాలు. ఎర్రగా, పొడుగుగా ఉండే నాలుక హోమాగ్ని. రోమాలు దర్భలు. యాగానికి కాలమైన పగలు, రాత్రి అతని రెండు కన్నులు. యాగాలలో ఉపయోగపడే స్రుక్ అతని ముక్కు. ఈ విధంగా వరాహస్వామి యజ్ఞపురుషుడై ఆవిర్భవించి, లోకానికి అంతటికి మంగళం కలిగిస్తున్నాడు.

వరాహస్వామియే యజ్ఞం మొదలైనవాటి వల్ల పొందబడేవాడు అనే విషయాన్ని సరోయోగి అనే పొయ్ గై ఆళ్వార్లు తమ ముదల్ తిరువన్దాది ప్రబంధంలో ఈ విధంగా తెలుపుతున్నారు.

**"శెవివాయ్ కణ్ మూక్కు ఉడలన్దైమ్బులనుమ్, శెందీ**
**పువి కాల్ నీర్ విణ్ పూదమైందుమ్, అవియాద**
**ఞానముమ్ వేళ్వియుమ్ నల్లఅముమెన్బరే**
**ఏనమాయ్ నిన్దార్ క్కు ఇయల్బు"** (12)

"కన్ను, చెవి, ముక్కు మొదలైన ఐదు ఇంద్రియాలు, పంచభూతాల వల్ల ఏర్పడే శరీరం, జ్ఞానం, పండిన భక్తి, యాగం, యజ్ఞం, హోమం మొదలైన కర్మలు, వివేకం, ఆత్మజ్ఞానం అనేవి వరాహస్వామిని పొందించే గొప్ప దారులు. వీటిని సాధనంగా చేసికొని ఆ భగవంతుని పొందవచ్చు" — అని దీని భావం.

వ్యాఖ్యాత ఇంతకంటే ఒక విలక్షణమైన ఒక అర్థాన్ని ఇక్కడ వివరించారు. ఈ అర్థం ఈ పాశురంలో చివర ఉండే 'ఎన్బరే'అనే పదంలో స్ఫురించే కాకుస్వరం ద్వారా ధ్వనిస్తున్నది.

"వరాహస్వామి దేనినీ ఎదురుచూడకుండా మనలను రక్షించాలని, తగిన సమయం కోసం ఎదురు చూసేటప్పుడు, శరీరం, భక్తి, యజ్ఞం, వివేకం అనేవి అతనిని పొందించే దారులు

అంటున్నారే, జ్ఞానం లేనివారు! 'నాకు రక్షకుడు వరాహ స్వామియే' అని నమ్మాళ్వార్లు పలికినట్లుగా అతడే తనను పొందించే సాధనం, ఇంతకంటే ఇంకొకటి లేదు. యజ్ఞవరాహస్వామిని పొందడానికి యజ్ఞం సాధనం కాదు. ఆ వరాహస్వామి చరణాలే సాధనం – అనే విషయాన్ని మనం తెలుసుకోవాలి. యాగం, యజ్ఞం అంటే ఒక దేవత కోసం అగ్నిలో పాలు, పెరుగు, నెయ్యి వంటి వస్తువులను ఆహుతిగా సమర్పించి, 'ఇవి నావి కావు, ఇవి అన్ని నీవే' అనే భావనతో ఉండడమే. యజ్ఞ వరాహస్వామి విషయంలో కూడా మనం మన మనసు, కన్ను, చెవి మొదలైన ఇంద్రియాలను సమర్పించి, 'ఇవి నావి కావు, నీవే' అని స్థిరమైన బుద్ధితో ఉండాలి. అతని భవ్య రూపానికి కల శక్తిచేత మన ఇంద్రియాలు సులభంగా నియంత్రించబడి, ఆత్మ చింతన కలిగి, భక్తి వికసిస్తుంది.

ఇంకొక ఏ దారిలోనూ వరాహమూర్తివి ఆశ్రయించము. ఆ వరాహస్వామిని నమస్కరించి వేరొక ఏ తక్కువ ఫలాన్ని కోరము. అతని శ్రీచరణాల బలంతోనే అతనిని పొందుతాము" — అనేదే ఇక్కడ ఆళ్వార్లు తెలిపిన పరమార్థం.

## లక్ష్మీవరాహస్వామి:

భూదేవిని రక్షించడం కోసం వరాహస్వామి అవతరించినప్పటికీ అతడు ఎల్లప్పుడు మహాలక్ష్మిని విడచి ఉండడు. శ్రీ విష్ణుపురాణంలో పరాశర మహర్షి ఈ విషయాన్ని **"నిత్యైవైషా జగన్మాతా విష్ణోః శ్రీరనపాయినీ, దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ"** (ఈ జగన్మాత లక్ష్మి నిత్యమైనది. ఏనాడూ విష్ణువును విడచి ఉండనిది. అతడు దేవుడై ఉన్నప్పుడు దేవరూపాన్ని, మానవుడై ఉన్నప్పుడు మానవ రూపాన్ని లక్ష్మీదేవి పొందుతుంది) అని లోకానికి తల్లి, విష్ణువు వక్షస్థలం విడిచి ఉండని శ్రీదేవి, అతడు ఏ రూపంలో ఉంటే ఆ రూపంలో అతని వెంట ఉంటుంది — అని అన్నారు. ఈ పరమార్థాన్ని వ్యక్తం చేయడం కోసమే వరాహస్వామి లక్ష్మీసహితుడై తొండ మండలంలోని 'తిరువెడవెంద్రై' అనే క్షేత్రంలో మనకు సాక్షాత్కరిస్తున్నాడు.

ఈ దివ్యక్షేత్రం చెన్నై నగరంనుండి 'తిరుక్కడల్మల్లై' (మహాబలిపురం) వెళ్ళే దారిలో ఉన్నది. దీని స్థలపురాణ వివరం చాలా ఆసక్తికరమైనది. పూర్వకాలంలో ఒక సమయంలో మేఘనాదుడు అనే ప్రభువుకు పుత్రుడు అయిన బలి, రాక్షసులకు సహాయంగా దేవతలతో యుద్ధం చేసి వారిని జయించాడు. ఆ పాపం పోవడం కోసం ఈ క్షేత్రానికి వచ్చి భగవంతుని ఉద్దేశించి తపస్సు చేయగా, శ్రీమన్నారాయణుడు వరాహరూపంలో 'వరాహతీర్థం' అనే సరోవర తీరంలో బలికి సాక్షాత్కరించాడు.



**నిత్యకళ్యాణ పెరుమాళ్ – తిరువిడవెందై**

వేరొక వృత్తాంతం కూడా ఇక్కడ ఈ క్షేత్రానికి సంబంధించినది చెప్పబడుతున్నది. సరస్వతీ నదీ తీరంలో తపస్సు చేసికొనే కాలవర్షి అనే ఋషి ఒక సంవత్సరంలో లక్ష్మీదేవి అంశంగా 360 మంది పుత్రికలను పొందాడు. వారికి వివాహ వయస్సు రాగానే వివాహం చేయాలని భావించి,

ఈ క్షేత్రానికి వచ్చి, వరాహస్వామిని ప్రార్థించాడు. భగవానుడు ఒక బ్రహ్మచారి రూపంలో వచ్చి, ఆ మహర్షి పుత్రికలను 360 మందిని ఒక్కొక్క దినం ఒక్కొక్క కన్యను వివాహం చేసికొని, చివరి నాడు మొత్తం 360 మంది కన్యలను ఒక రూపంగా చేసి, తన ఎడమ ఒడిలో పెట్టుకొని దర్శనం ఇచ్చాడు. ఆ కన్యరూపమే లక్ష్మీదేవి. ఆ విధంగా లక్ష్మీదేవిని తన ఎడమ భాగంలో కలిగి ఉన్నందున ఈ క్షేత్రానికి **'తిరువెడవెందై'** అనే పేరు వచ్చింది. ఇక్కడ ఉండే స్వామికి కూడా లక్ష్మీవరాహస్వామి అనే పేరు ప్రసిద్ధమైనది. ఈ ఊరిలో వేంచేసి ఉండే ఉత్సవమూర్తికి 'నిత్య కళ్యాణప్పెరుమాళ్' అనే పేరు కలిగింది. కన్యలందరును చేరి ఒక కన్యకగా అయినందున, ఈ ఊరిలోని అమ్మవారికి 'అఖిలవల్లి నాచ్చియార్' అనే పేరు కలిగింది. ఈ క్షేత్రంలోని లక్ష్మీ వరాహస్వామిని తిరుమంగై ఆళ్వార్ పెరియ తిరుమొళి ప్రబంధంలోని రెండవ శతకం ఏడవ దశకంలో 10 పాశురాలతో కీర్తించారు.



**నిత్యకళ్యాణ పెరుమాళ్ (ఉత్సవర్లు) – తిరువిడవెందై**

ఎడమవైపు లక్ష్మీదేవిని కలిగి ఉండే క్షేత్రం ఉన్నట్లే, కుడి వైపున లక్ష్మీదేవిని కలిగి ఉండే క్షేత్రం కూడా ఉన్నది. 'తిరువెడవెందై' క్షేత్రంలోని వరాహమూర్తిని మహా బలిపురానికి చెందిన

ప్రభువు ఒకడు భక్తితో ప్రతిదినం వచ్చి సేవించేవాడు. అతడు ఈ విధంగా ప్రతి దినం చాలా దూరం వచ్చినందున, తన భక్తుడు ప్రతిదినం పడే కష్టాన్ని చూచి సహించలేని స్వామి, మహాబలిపురంలో నిత్యవాసాన్ని ఏర్పరచుకొని, తన ఎడమ పక్క మహాలక్ష్మితో దర్శనాన్ని ఆ ప్రభువుకు అనుగ్రహించాడు. అందువల్ల ఈ క్షేత్రానికి **'తిరువలవెంద్రై'** అని పేరు.



**శ్రీ ఆదివరాహ స్వామి – తిరువలవెంద్రై (మహాబలిపురం)**

**కోలవరాహస్వామి:**

భగవంతుడు సంసారులను సంస్కరించి, తనవైపు తిప్పుకొని ఆకర్షించడం కోసం పలు ప్రయత్నాలు చేస్తున్నాడు. మొదట వేదాల ద్వారా జ్ఞానాన్నిఅనుగ్రహించి, వివేకాన్ని పొందడానికి సహాయపడ్డాడు. వాటిని అర్థం చేసుకొని జీవులు సరైన మార్గంలో నడవలేనప్పుడు, తానే అవతరించి, తన ఉపదేశాలతో, ఆచరణతో లోకానికి సన్మార్గాన్ని చూపాడు. అప్పటికీ దారికి రాని ఈ జీవులను దిద్దుబాటు చేయడం కోసం ఆఴ్వార్లను, తరువాత ఆచార్యులను అవతరింపజేసి, లోకాన్ని సంస్కరించడానికి ప్రయత్నించాడు. ఆ విధంగా కూడా జీవులు దారిలోకి రానప్పుడు చివరి ఆయుధాన్ని ఉపయోగిస్తాడు. అదే అతని రూప సౌందర్యం. ఆ స్వామి అందమైన రూపంలో

ఆకర్షింపబడి, అందులో చిక్కుకోనివారు ఎవరైనా ఉంటారా? ఎవరూ ఉండరు కదా! ఏ ఉపాయానికి దారికి రాని రీతిలో రాతి గుండెను కలవారు కూడా ఆ స్వామి రూప సౌందర్యంలో చిక్కుకుంటారు కదా! చివరకు శిశుపాలుని వంటివారు కూడా భగవంతుని రూపసౌందర్యంచేత ఆకర్షింపబడ్డారు కదా!

వరాహస్వామి అవతరించినప్పుడు ఆ స్వామి రూపసౌందర్యాన్ని వర్ణించలేక ఋషులు తికమక పడ్డారు. ఆళ్వార్లు మాత్రం ఆ స్వామి అనుగ్రహం చేత జ్ఞానాన్ని, భక్తిని పొంది, అతడే తన సౌందర్యాన్ని ప్రకాశింపజేయగా దర్శించి, తమ అందమైన పాశురాల ద్వారా ఆ స్వామి యొక్క ఒక్కొక్క అవయవంలోని అందాన్ని అందమైన చిత్రాన్ని లభించినట్లుగా లిఖించారు. ఆ విషయం సంగ్రహంగా గమనిద్దాం.

తమిళ భాషలో 'కోల' అంటే అందం. 'కోల వరాహం' అని అంటే రూపసౌందర్యం కల వరాహస్వామి అని అర్థం. వరాహ స్వామి విశేషకటాక్షాన్ని పొందిన నమ్మాళ్వార్లు తమ తిరువాయ్ మొళి ప్రబంధం చివరలో( 10—10—7) "ఆ స్వామిని ఏనాడు విడువలేను సుమా" అని అన్నారు. ఆ అద్భుతమైన పాశురం ఏమంటే —

**కోల మలర్ పావైక్కన్బాకియ ఎన్ అన్బేయో!**
**నీలవరై ఇరండు పిఱై కవ్వి నిమిర్ న్దదొప్ప**
**కోల వరాక మొన్ఱాయ్ నిలమ్ కోట్టిడై క్కొండ ఎందాయ్!**
**నీలక్కడల్ కడైందాయ్ ఉన్నై ప్పెఱ్ఱిని ప్పోక్కువనో!**

అందమైన మహాలక్ష్మి విషయంలో గొప్ప ప్రేమను కలవాడవు అయినందున, ఆమె ఆశ్రయాన్ని పొందిన నా విషయంలో కూడా ప్రీతిని చూపించే ఓ స్వామీ!, ఒక అంజన పర్వతం రెండు చంద్రవంకలను రెండు వైపులా కలిగినదై, ఉన్నతంగా అభివృద్ధి చెందినట్లుగా చాలా అందమైన సాటిలేని వరాహ రూపుడవై, భూదేవిని నీ కోరదంతంతో ధరించిన స్వామివైన నీవు నన్ను కూడా సంసార సముద్రంనుండి ఉద్ధరిస్తావు అనే నమ్మకాన్ని కలిగించేవాడా!,

పాలసముద్రాన్ని చిలికి, భక్తులను కాపాడినవాడా!, నీవు లభించిన తర్వాత నిన్ను ఏనాడైనా విడువగలనా? — అని వరాహ స్వామి విషయంలో నమ్మాళ్వార్లు తమ అంతులేని అభినివేశాన్ని వ్యక్తం చేశారు. భూదేవిని రక్షించడంకోసం వరాహస్వామివై అవతరించావు. లక్ష్మీదేవిని పొందడం కోసం పాల సముద్రాన్ని చిలికావు. అళ్వార్లు అయిన నన్ను రక్షించడం కోసం ఈ రెండిటిని చేసిన నిన్ను ఇక విడువగలనా! – అని అంటున్నారు, అళ్వార్లు.

ఈ పాశురంలో ఆళ్వార్లు "కోలవరాకన్" అని ఆ స్వామి రూపంలోని అందాన్ని వర్ణించారు. వరాహస్వామి నీల రూపంతో ఆకాశాన్ని తాకే విధంగా ఎదిగి, తన కోరదంతాలతో భూమిని ఎత్తాడు. దీనికి ఉపమానం చెప్పే నమ్మాళ్వార్లు ఒక అందమైన, ఎత్తయిన నీలపర్వతం, రెండు చంద్ర ఖండాలను రెండువైపులా కలిగిఉన్నట్లుగా భాసిస్తున్నది – అని అంటున్నారు. చంద్రునిలో ఒక నల్లని మచ్చ కనిపిస్తుంది. హరితవర్ణంలోని భూదేవి వరాహస్వామి తెల్లని కోరదంతం ఒక మూలలో అంటుకుని ఉండడం చూస్తే, భూమి చంద్రునిలోని నల్లని మచ్చ వలే ప్రకాశిస్తూ ఉన్నది – అని అందంగా అళ్వార్లు ఒక అందమైన దృశ్యాన్ని మన మనసులో సాక్షాత్కరింప చేస్తున్నారు.

పెరియాళ్వార్లు వరాహస్వామి రూపంలోని అందాన్ని తమ 'పెరియాళ్వార్ తిరుమొళి' అనే అందమైన ప్రబంధంలో (2—10—9) ఒక పాశురంలో మరొక అందమైన రీతిలో చిత్రీకరిస్తున్నారు.

**వానత్తెళుంద మాముకిల్ పోల్, ఎంగుమ్**
**కానత్తు మేయ్ న్దు కనిత్తు విళైయాడి,**
**ఏనత్తురువాయ్ ఇడంద విడమ్ మణ్ణినై**
**తానత్తే వైత్తానాలిన్ను ముఱ్ఱుమ్ తరణి యిడందానాలిన్ను ముఱ్ఱుమ్**

నిండుగా నీటిని తాగి, ఆకాశం లో పైకి వచ్చి, కురవడానికి సిద్ధంగా ఉండే నీలమేఘంవంటి రూపాన్ని కలిగిన వరాహస్వామి, అరణ్యాల్లో అన్నిచోట్ల ఎదిరించేవారు ఎవ్వరు

లేకుండా తిరిగి, తుంగముస్తెలు మొదలైనవానిని ఆరగించి, గర్వంతో క్రీడించి, భూమిని సముద్రంలో నుండి ఉద్ధరించి, తన ఎడమ వైపు ధరించాడు. కానీ మనలను విరహసముద్రంలో గెంటివేశాడు – అని అన్నారు. నల్లని మేఘం తనను చూసేవారి మనసులో ఉండే తాపాన్ని పోగొడుతుంది. ఏ భేదం చూపించకుండా అన్ని చోట్ల వర్షించి తన ఔదార్యాన్ని చూపుతుంది. ఆకాశంలో అంతటా వ్యాపిస్తుంది. గొప్పగా వెలిగే మెరుపుతీగతో కూడి ఉంటుంది. ఆ విధంగానే, వరాహస్వామి తనను చూసేవారి పాపం తీర్చి చల్లబరుస్తాడు. గొప్పవారు, తక్కువవారు అనే భేదం లేకుండా కరుణను అందరి విషయంలో కురిపిస్తాడు. అరణ్యంలో అంతటా సంచరిస్తాడు. మెరిసే లక్ష్మీదేవితో కలసి ఉంటాడు. మేఘాన్ని చూస్తే చిన్నవారు, పెద్దవారు అందరు ఆనందంతో గంతులు వేస్తారు. వరాహస్వామిని దర్శిస్తే జ్ఞానం లేనివారు, ఉన్నవారు అందరూ ఆనందిస్తారు..

వరాహానికి ఇంతటి అందం ఉంటుందా? – అని సందేహం కలుగవచ్చు. శ్రీమన్నారాయణుడు ఏ రూపంలో అవతరించినా తన గొప్పతనంలో, గుణాలలో ఏ లోటు లేకుండా ఉండేటట్లు అవతరిస్తాడు – అని వేదాలు, గీత తెలుపుతున్నాయి. వరాహానికి కేశాలు అందంగా ఉంటాయని మనం గమనిస్తామా? కానీ, నమ్మాళ్వార్లు **"కేళ్ళల్ ఒన్గాకి ఇడన్ద కేశవన్"** (1–9–2) అని శ్రీ వరాహస్వామి కేశాల అందాన్ని కొనియాడారు. తిరుమంగై ఆళ్వార్ ఇంతకంటే ముందుకుపోయి పెరియ తిరుమొళ్ళి ప్రబంధంలో **"కళ్ళార్ తుళాయుమ్"** (11–7–6) అనే పాశురంలో, లోకంలో ఏ పుష్పం చూసినా వరాహ స్వామి కేశాలకు అలంకరించాలి అని అంటున్నారు. ఇన్ని మాటలు ఎందుకు? కోల వరాహస్వామి అందమే అందం. మనం దర్శించిన హితం అయిన వరాహస్వామి అందంగా ఉండేటప్పుడు, ఆ స్వామి పాదాలను ఆశ్రయించడానికి వెనుకాడడం ఎందుకు? చెరకు తినడానికి కూలి ఇవ్వాలా?

**వరాహనరసింహస్వామి:**

భగవంతుడు అనుగ్రహించిన అవతారాలలో సింహ రూపం, మానవ రూపం కలసి ఉన్నందున నరసింహ అవతారానికి ఒక ప్రత్యేకత ఉన్నది. **"నృహరిదశయోరౌత్పత్తికం**

**ఘటనాద్భుతమ్"** అని పరాశర భట్టర్ పలికినట్లుగా అపూర్వంగా రెండు రూపాల కలయికతో నరసింహస్వామి అవతరించాడు. పాలు, చక్కెరలను కలిపి భుజించేవాడు, వాటిని వేరువేరుగా భుజిస్తే అంతగా ఆనందించడు. మానవరూపం, సింహ రూపం కలిసినప్పుడు ఇంత ఆనందం కలిగిస్తే, ఇక ఆ భగవంతుని రెండు అవతారాలు కలిసి ఒక రూపాన్ని పొందితే, దాని గొప్పతనం ఇంత అని చెప్పడానికి వీలు కాదు కదా! వరాహావతారం, నరసింహావతారం కలసి వరాహ నరసింహమైన స్వామి విశాఖపట్టణానికి దగ్గరలో ఉండే 'సింహాచలం' అనే పుణ్యక్షేత్రంలో దర్శనాన్ని అనుగ్రహిస్తున్నాడు. భూదేవిని రక్షించడానికి పుట్టిన వరాహుడు, భక్తుడైన ప్రహ్లాదుని కాపాడడం కోసం అవతరించిన నరసింహుడు ఒకటిగా కలసి, ఒక రూపాన్ని ధరించిన వృత్తాంతం చాలా మధురమైనది.



**శ్రీ వరాహ లక్ష్మీనరసింహ స్వామి – సింహాచలం**

**"ఓం నమో నారాయణాయ"** అనే అష్టాక్షరీ మహా మంత్రాన్ని పలికిన ప్రహ్లాదుని, ఈ విషయంలో చాలా కోపాన్ని పొందిన అతని తండ్రి హిరణ్యకశ్యపుడు ఆ బాలుని సముద్రంలో ముంచి, అతనిని పర్వతాలపై నుండి గెంటి, పలు విధాలుగా బాధించ మని, వధించమని ఆజ్ఞాపించాడు. అతని సేవకులైన రాక్షసులు ఆ విధంగా పెట్టిన బాధలకు ప్రహ్లాదుడు ఏమాత్రం భయపడలేదు. చిరునవ్వు ముఖంతో ఆ దండనలను స్వీకరించాడు. తన భక్తుని ప్రహ్లాదుని ఈ

విధంగా హిరణ్యకశిపుడు బాధించడం భగవంతుడు సహించలేక స్తంభంలోనుండి నరసింహ రూపాన్ని ధరించి ఆవిర్భవించి, ఆ అసురుని సంహరించాడు. ఆ విధంగా ప్రహ్లాదుడు రక్షింపబడ్డాడు. తన భక్తుని రక్షించిన తర్వాత కూడా నరసింహస్వామి కోపాన్ని తగ్గించుకోకుండా భూమండలం అంతా తిరిగాడు. ప్రహ్లాదుని ప్రార్థనను అనుసరించి కోపాన్ని ఉపశమింప చేసికొని, సింహాచలంపై హిరణ్యాక్షుని సంహరించిన వరాహ రూపం ,హిరణ్యకశిపుని సంహరించిన నరసింహ రూపం అనే ఈ రెండు రూపాల కలయికతో వరాహనరసింహస్వామిగా ఆవిర్భవించి, భక్తుని కోరికను మన్నించాడు. ప్రహ్లాదుడు వరాహనరసింహ స్వామిని స్తుతించి, అక్కడే నిత్యనివాసాన్ని ఏర్పాటు చేసుకోవలసినదిగా ప్రార్థించాడు. ఆ కోరికను అంగీకరించిన వరాహ నరసింహస్వామి కృతయుగం అంతా అక్కడే ఉండి, సేవను అనుగ్రహించాడు, అక్కడ మొదటగా ఆలయాన్ని కట్టించినవాడు ప్రహ్లాదుడు. తరువాత ఆ సింహాచలం క్షేత్రంలోని ఆలయం జీర్ణమయిపోయింది. స్వామిరూపం మరుగున పడింది. అప్పుడు చంద్రవంశంలో పుట్టిన పురూరవుడు అనే ప్రభువు ఈ క్షేత్రానికి వచ్చి, వరాహనరసింహ స్వామి అనుగ్రహంతో ఆ మూర్తిని గమనించి, ఆ స్వామికి ఆలయాన్ని కట్టించాలని తలచి, ఆ స్వామి ఉండే చోట మన్ను తవ్వడం ఆరంభించాడు. అప్పుడు ఒక అశరీరవాణి ఈ విధంగా వినిపించింది. "నన్ను పూర్తిగా బయటకు తీయవద్దు. సంవత్సరం అంతా నన్ను చందనంతో కప్పి అలంకరించి, వైశాఖ మాసం శుక్లతదియ నాడు మాత్రం ఆ చందన లేపనాన్ని తొలగించి, అందరూ నన్ను దర్శనం చేసుకునేటట్లు చెయ్యి" అని ఆ వాణి అజ్ఞాపించింది. పురూరవుడు ఆ వాణిని భగవదాజ్ఞగా భావించి, తరువాత మన్ను తీయడం నిలిపివేశాడు. అంతవరకు బయటకు వచ్చిన వరాహనరసింహ స్వామి రూపానికి చందనాన్ని అలంకరించాడు. ఈ క్రమాన్ని అనుసరించి ఈనాటికీ వరాహనరసింహ స్వామికి సంవత్సరం పొడుగునా చందనం సమర్పింపబడడం, వైశాఖ శుక్ల తదియనాడు ఆ చందన లేపనం తొలగించగా, అందరూ నిజరూప దర్శనాన్ని చేసికోవడం జరుగుతున్నది.

వరాహ, నరసింహ రూపాలు రెండు కలసిన మూర్తిని దర్శించి గొప్ప అనుభూతిని పొందిన పెరియాళ్వార్లు ఆ రూపాన్ని పెరియాళ్వార్ తిరుమొళి ప్రబంధంలో **"వల్ ఎయిఱ్ఱు**

**క్కేళ్ళులుమాయ్, వాళ్ ఎయిఱ్రు చ్ఛీయముమాయ్, ఎచ్చీ ఇల్లా త్తరణియైయుం, అవుణనైయుం ఇడందాన్ ఊర్, ఎల్లియం పోదిరుంజిత్తై వండు, ఎం పెరుమాన్ కుణం పాడి, మల్లిగై వెణ్ శంగూదుం, మదిళ్ అరంగం ఎన్బదువే"** (4—8—8) అనే సూక్తి ద్వారా అనుసంధించారు. ఇందులో "భూమిని రక్షించడం కోసం బలమైన కోరదంతాలతో వరాహంగాను, హిరణ్యకశిపుని సంహరించడంకోసం పదునైన దంష్ట్రలతో సింహంగాను అవతరించిన స్వామి నిత్యవాసం చేసే శ్రీరంగం" అని అంటూ శ్రీరంగనాథునిలో ఆ వరాహనరసింహ రూపాన్ని అందంగా భావన చేశారు.



**శ్రీ వరాహ లక్ష్మీనరసింహ స్వామి – సింహాచలం (నిత్యరూప దర్శనం)**

వరాహరూప, నరసింహ రూపాల కలయికతో నిర్మింపబడే సుదర్శన మూర్తి యంత్రానికి సంబంధించిన విధానం అహిర్బుధ్న్య సంహిత మొదలైన ఆగమ గ్రంథాలలో తెలుపబడింది. శ్రీసుదర్శన శతకంలోని **"దంష్ట్రాకాంత్యా కడారేః"** అనే శ్లోకంలో సుదర్శన యంత్రంలోని వరాహ,

నరసింహ రూపాల కలయిక యొక్క సన్నివేశం వర్ణింపబడింది. ఇటువంటి సన్నివేశాన్ని కల సుదర్శనమూర్తిని ఆరాధిస్తే **"రహయత్వస్త్రరాజో రుజం వః"** అనే విధంగా వ్యాధులు తొలగిపోతాయి – అని కూడా అందులో చెప్పబడింది.

## భూవరాహస్వామి:

శ్రీమన్నారాయణుడు ఆవిర్భవించి వేంచేసి ఉండే క్షేత్రాలను పెద్దలు ఆయా దివ్యదేశాలలో భగవానుడు ఆవిర్భవించిన రీతినిబట్టి పలు విధాలుగా అవి విభాగింపబడ్డాయి.భగవంతుడు స్వయంగా వ్యక్తం అయిన క్షేత్రాలను స్వయం వ్యక్తాలని, దేవతలచే ప్రతిష్ఠింపబడినవి దివ్యాలు అని, ఋషులు ప్రతిష్ఠ చేసినవి ఆర్షాలని, మానవులు ప్రతిష్ఠ చేసినవి మానుషాలని చెప్పబడుతున్నాయి.

వీటిలో, స్వయంవ్యక్తాలుఎనిమిది క్షేత్రాలు ఉన్నాయి. ఉత్తరభారతంలోని బదరికాశ్రమం, సాలగ్రామం, నైమిశారణ్యం, పుష్కరం అనే నాలుగు దక్షిణ దేశంలో ఉండే వేంకటాచలం, శ్రీరంగం, వానమామలై, శ్రీముష్ణం అనే నాలుగు దివ్యదేశాలలో భగవంతుడు స్వయంగా వ్యక్తం అయ్యాడు. అందుచేత ఇవి స్వయంవ్యక్త క్షేత్రాలు అనబడుతున్నాయి. శ్రీముష్ణం అనే క్షేత్రానికి **"శ్రియం ముష్ణాతి"** అనే వ్యుత్పత్తి ద్వారా భూదేవిని నీటి పైభాగం వరకు గ్రహించి, ఉద్ధరించినపుడు కలిగిన తేజస్సును పొందుతున్నాడు. కనుక ఆ పేరు వచ్చిందని చెప్పబడుతున్నది. శ్రీముష్ణక్షేత్రంలో మూలమూర్తి పూర్తిగా సాలగ్రామమూర్తి. పైకి చూస్తూ ఉండే సన్నివేశంలో స్వామి దర్శనం ఇస్తున్నాడు. ముఖం దక్షిణ దిక్కు వైపు చూస్తూ ఉన్నది. హిరణ్యాక్షుని వధించి భూదేవిని రక్షించినందున కలిగిన ఆనందం పొంగగా, విజయగర్వంతో రెండు చేతులను నడుముపై పెట్టుకొని గంభీరంగా భగవానుడు ఇక్కడ సాక్షాత్కరిస్తున్నాడు. ఉత్సవమూర్తి యజ్ఞవరాహమూర్తి. శ్రీదేవి భూదేవులతో కలసి సేవను అనుగ్రహిస్తున్నాడు. దగ్గరలో ఆదివరాహమూర్తి కూడా ఉన్నాడు. భూదేవిని నీటిలోనుండి ఉద్ధరించిన తర్వాత, ఆ భూదేవి చేసిన ప్రార్థనను అంగీకరించి

వరాహస్వామి వేంచేసి ఉన్న చోటు ఇది. అందుచేతనే ఈ స్వామికి 'భూవరాహస్వామి' అనే పేరు వచ్చింది.

మన సంప్రదాయానికి 'శ్రీసంప్రదాయం' అని పేరు. శ్రీ అనే పదంతో పిలువబడే లక్ష్మీదేవిని పురుషకారంగా చేసుకొని నారాయణుని శ్రీచరణాలను ఆశ్రయించాలి – అనేది ఈ సంప్రదాయం. శ్రీరాముని ఆశ్రయించడం కోసం శ్రీదేవి అవతారమైన సీతాదేవిని, వరాహస్వామిని ఆశ్రయించడం కోసం భూదేవిని, శ్రీకృష్ణుని ఆశ్రయించడం కోస నీలాదేవి అవతారమైన నప్పిన్నై ప్పిరాట్టిని పురస్కరించుకోవాలి. ఈ క్రమంలో వరాహస్వామి 'భూవరాహస్వామిగా' భక్తులు తనను సులభంగా ఆశ్రయించడానికి తగినట్లు ఈ క్షేత్రంలో ఆవిర్భవించి దర్శనం ఇస్తున్నాడు.

భగవంతుడు శ్రీదేవి విషయంలో కంటే భూదేవి పట్ల ఎక్కువ ప్రేమను కలిగి ఉంటాడు – అనే విషయాన్ని ఆழ்వార్లు పలు పాశురాలలో వ్యక్తం చేశారు. నమ్మాழ்వార్లు,

**"కిడందిరుందు నిన్ఱళందు, కేழ்లాయ్ క్కీழ் పు**
**క్కిడందిడుం, తన్నుళ్ కరక్కుం ఉమిழ్రుమ్,**
**తడం పెరున్ తోళ్ ఆర త్తழ்రువుం, పార్ ఎన్నుం**
**మడందైయై, మాల్ శెయ్ గిన్ఱ మాల్, ఆర్ కాణ్బారే"** (తిరువాయ్ మొழி 2–8–7)

అనే పాశురంలో "భగవంతుడు పరుండడం, కూర్చోవడం, నిలిచి ఉండడం ఈ భూమిపైననే చేస్తాడు. భూమిని బలి చక్రవర్తి అపహరించినప్పుడు త్రివిక్రముడుగా అవతరించి ఆ భూమిని పొంది మళ్ళీ కొలిచాడు. భూమిని హిరణ్యాక్షుడు అనే అసురుడు నీటిలో ముంచినప్పుడు, దానిని ఉద్ధరించాడు. భూమికి ప్రళయ సమయంలో ఆపద వచ్చినప్పుడు, దానిని కడుపులో పెట్టుకొని కాపాడాడు. సృష్టి ప్రారంభంలో మళ్ళీ బయటకు వ్యక్తం చేశాడు. ఇటువంటి భూదేవిని తన ఒడిలో పెట్టుకొని, తన భుజాలను ఆనందంగా తడుముకునే స్వామికి ఆ భూదేవి పట్ల ఉండే ప్రీతి ఎంతటితో ఎవరికీ తెలియదు" అని అన్నారు.



**శ్రీ భూవరాహ స్వామి – మైహోం అవతార్ – హైదరాబాదు**

గోదాదేవి, నాచ్చియార్ తిరుమొழி అనే ప్రబంధంలో **“పాశి తూర్తు క్కిడంద పార్ మగట్కు, పండొరునాళ్ మాశుడంబిల్ నీర్ వారా, మానం ఇలా ప్పన్టియాం, తేశుడైయ తేవర్, తిరువంగ చ్చెల్వనార్, పేశి ఇరుప్పనగళ్, పేర్కవుం పేరావే”** (11−8) భూదేవియొక్క ప్రాముఖ్యాన్ని కీర్తించారు. గోదాదేవి భూదేవి అంశతో అవతరించినది కదా! భూదేవి ప్రళయ కాలంలో చాలాకాలం నీటిలో మునిగి ఉన్నందున, దానికి పాచి పట్టి, మురికి చేరింది. ఆమెను ఆదరంగా గ్రహించి కాపాడడం కోసం అవతరించిన వరాహమూర్తినుండి మురికి నీరు కారింది. వాస్తవానికి భగవంతునికి మేని మన శరీరంవలె పంచభూతాలతో నిర్మింపబడినది కాదు. పంచ శక్తులతో, 5 విధాలైన ఉపనిషత్తులతో రూపొందినది. కనుక, దానికి మురికిగాని, వ్యాధిగాని, ముసలితనం గాని, మరణం కాని లేవు. ఈ విధంగా ఉండగా, వరాహమూర్తి మేనినుండి మురికి

నీరు కారుతుందా? – అనే సందేహం కలుగుతుంది. గోదాదేవి పలికిన ఈ పాశురానికి వ్యాఖ్యానం చేసిన పెరియవాచ్చాన్ పిళ్ళై ఇక్కడ ఉండే రహస్యాన్ని వ్యక్తం చేశారు. లోకంలో ఉండే



**శ్రీభూవరాహస్వామి – శ్రీముష్ణం (చిదంబరం)**

క్రమాన్నిబట్టి, భార్య అలంకరించుకొని ఆనందంతో ఉన్నప్పుడే భర్త కూడా అలంకరించుకోవాలి. భార్య దుఃఖంలో ఉన్నప్పుడు భర్త మాత్రం అలంకరించుకుంటే అది పరిహాసానికి కారణమవుతుంది. దీనిని అనుసరించే గొప్ప భర్త అయిన వరాహమూర్తి కూడా భూదేవి దుఃఖంలో ఉండే ఆ సమయంలో తాను అలంకరించుకోకూడదు – అని భావించి. మురికితో నిండిన శరీరంనుండి నీరు కారే రీతిలో ఆవిర్భవించాడు. ఈ విషయంలో ఆ స్వామికి ఉన్న ప్రేమ ఇంతటిది అని వర్ణించడానికి సాధ్యం కాదు. అంతేకాక, ఈ పాశురంలో గోదాదేవి వరాహమూర్తిని **"మానమిలాప్పన్ని"** అని పొగిడింది. ఈ ప్రయోగానికి రెండు విధాలైన అర్థాలను పెద్దలు తెలియజేశారు. "అభిమానం లేని" అనేది ఒక అర్థం. తాను, ఈశ్వరుడు అనే గర్వం ఏమీ లేకుండా

వరాహ సమూహంతో కలసిన వరాహమూర్తి సౌలభ్యం దీనివల్ల వ్యక్తం అయినది. దీనిని శ్రీరామాయణంలో ఉండే ఒక సందర్భాన్ని చూచి తెలుసుకోవచ్చు. మారీచుడు మాయతో బంగారు లేడి రూపంలో వచ్చినప్పుడు, అతనికి దగ్గరలో ఉండే లేళ్ళగుంపు ఆ మాయామృగాన్ని వాసన చూచి, ఆ శరీరంనుండి రాక్షస వాసన వచ్చినందున, "ఇది మన జాతికి చెందిన కాదు" అని గ్రహించి దూరంగా తొలగిపోయాయి. మారీచుడు తన రూపాన్ని మార్చుకోగలిగేగాడే తప్ప, తనకు ఉండే సహజమైన రాక్షస వాసనను పోగొట్టుకోలేకపోయాడు. కానీ భగవంతుడు వరాహంగా అవతరించినప్పుడు ఆ స్వామికి దగ్గరలో ఉండే వరాహాలు ఆ రూపాన్ని వాసన చూసి, "ఇది మన జాతికి చెందినదే" అని నమ్మి, ఆ వరాహమూర్తితో చేరిపోయాయి. ఈ విధంగా భగవంతుని రూపం మాత్రమే మారలేదు; ఈశ్వర వాసనను కూడా ఆచ్ఛాదించుకుని, వరాహరూపానికి తగిన వాసనతోనే వచ్చిన ఆ వరాహరూపాన్ని గోదాదేవి "మానమిలా ప్పన్టి" (ఉపమానం లేని) అని కీర్తించింది.

ఈ వరాహంవలె లోకంలో ఇంకొక వరాహం లేనందున, రెండవ అర్థంలో "ఉపమానం లేని వరాహం" అని చెప్పబడుతున్నది. ఈ విధంగా అభిమానం, ఉపమానం లేకుండా భూదేవి విషయంలో ప్రేమను వ్యక్తం చేయడం కోసమే భూవరాహస్వామి అవతరించాడు.

భూదేవికి, వరాహస్వామికి జరిగిన కళ్యాణ వృత్తాంతాన్ని పెరియాళ్వార్లు చాలా అందంగా తమ ప్రబంధంలో ప్రస్తావించారు. **“కోట్టు మణ్ కొండిడందు, కుడంగైయిల్ మణ్ కొండళందు, మీట్టుం అదుండుమిళ్లన్దు, విళైయాడుం విమలన్ మలై, ఈట్టియ పల్ పొరుళ్గళ్, ఎంబిరానుక్కడియుళై ఎన్ఱు, ఓట్టరుం తణ్ శిలంబాఱుడై, మాలిరుంజోలైయదే”** (4-3-9) “భూమి – పర్వతాలను, సముద్రాలను, ఇంకా అన్నిటినీ ప్రళయకాలంలో ఆరగించి, సృష్టి కాలంలో వెలువరించిన స్వామిని ఆదరంతో పొందాలని ఆశపడింది. ఆమె ఆశకు తగినట్లు సాటిలేని భూవరాహమూర్తిగా అవతరించి, భూమిని ఉద్ధరించి, నల్లని, అందమైన కేశాలను కలిగిన భూదేవిని వివాహం చేసుకున్న వరాహ స్వామిని దర్శించండి” — అని ఈ పాశురంలో అళ్వార్లు పలికారు.

తైత్తిరీయోపనిషత్తు కూడా "**ఉద్ధృతాసి వరాహేణ కృష్ణేన శతబాహునా**" (ఓ భూదేవీ! నీవు వంద బాహువులను కల వరాహమూర్తిచే ఉద్ధరింపబడ్డావు) – అని వరాహస్వామి భూదేవిని ఉద్ధరించిన వృత్తాంతాన్ని స్తుతించింది.



**శ్రీభూవరాహస్వామి (ఉత్సవర్లు) – శ్రీముష్ణం (చిదంబరం)**

వేదాంత దేశికులు భూస్తుతిలో "**పత్యుః దక్షిణపాణిపంకజపుటే విన్యస్తపాదాంబుజం, వామం పన్నగసార్వభౌమసదృశం పర్యంకయంతీ భుజమ్**" (భూదేవి, భూవరాహ స్వామి తామరపువ్వంటి దక్షిణ శ్రీ హస్తంలో తన పద్మం వంటి పాదాలను పెట్టుకున్నది. ఆ విధంగానే, మడచిన ఆ స్వామి ఎడమ భుజాన్ని ఆనుకొని శయనించినది) అని అన్నారు. భూదేవి, భూవరాహస్వామి ఒడిలో వేంచేసి ఉన్నది. తనను ఆలింగనం చేసుకుంటున్న ఆ స్వామి

ఎడమచేతిని తల దిండుగా చేసుకొని, శయనించి ఉన్నది. ఆమె రెండు పాదాలను స్వామి తన కుడిచేతితో ధరించి, లోకానికి చూపి, ఏదో ఒక రహస్యాన్ని ఉపదేశిస్తున్నట్లున్నాడు. "భూవరాహుడను అయిన నన్ను ఆశ్రయించడానికి ముందు ఈ భూదేవి చరణాలను ఆశ్రయించండి" – అని ఉపదేశిస్తున్నట్లు ఈ సన్నివేశం ఉన్నది. ఈ విధంగా, ఈ భూవరాహ స్వామియే మనం దర్శించిన, దర్శించే, దర్శించబోయే, దర్శించవలసిన హితం.

**మఱవాద వరాకన్ (మరచిపోలేని వరాహమూర్తి):**

మనం వరాహస్వామిని మరచిపోకుండా మనసులో ధ్యానం చేస్తే, మనం జీవించి ఉన్నప్పుడు, మన చివరి కాలంలోను ఆ స్వామి మనలను మర్చిపోకుండా, ఉన్నత గతిని కలుగజేస్తాడు. అతనిని మనం మరిచిపోకుండా ఉన్నందుకు మనకు జ్ఞానాన్ని కలిగిస్తున్నందున, ఆ స్వామి 'జ్ఞాన ప్పిరాన్' అనే పేరును పొందాడు. ఆఴ్వార్ తిరునగరి దివ్యదేశంలో ఉండే వరాహస్వామికి 'జ్ఞానప్పిరాన్' అని పేరు. ఈ స్వామిని నమ్మా ఴ్వార్లు తిరువిరుత్త ప్రబంధం చివరిలో **"జ్ఞానప్పిరానై అల్లాలిల్లై నాన్ కండ నల్లదువే"** అని కీర్తించారు.

'పిరాన్' అంటే 'సహాయం చేసేవాడు' అని అర్థం. మనకు వరాహస్వామి జ్ఞానాన్ని కలిగించి సహాయపడే విషయాన్ని తిరుమఴిశై ఆఴ్వార్, తమ తిరుచ్చంద విరుత్త ప్రబంధంలో,

**"ఈనమాయ ఎట్టుం నీక్కి, ఏదం ఇన్ఱి మీదు పోయ్,**
**వానం ఆళ వల్లైయేల్, వణంగి వాఴ్తెన్ నెంజమే,**
**ఞానం ఆగి ఞాయిఱాగి, ఞాల ముఱ్ఱుం ఓర్ ఎయిఱ్ఱు,**
**ఏనమాయ్ ఇడంద మూర్తి, ఎందై పాదం ఎణ్ణియే"** (114)

అనే పాశురంలో కీర్తించారు. "ఓ మనసా! జ్ఞానాన్ని ఆవరించే అవిద్య, కర్మ, వాసన, రుచి, జన్మ, మూడు తాపాలు అనే ఎనిమిది విషయాలను పోగొట్టుకొని, అర్చిరాది మార్గం ద్వారా పరమపదాన్ని పొంది, ఆనందాన్ని పొందాలని ఆశపడితే, ఆత్మజ్ఞానాన్ని కలిగించేవాడు, భూమిని

వరాహరూపిగా ఉద్ధరించినవాడైన స్వామియొక్క చరణాలను నమస్కరించి తరించు" – అని ఇందులో తెలిపారు. ఈ పాశురంలో పలికినవిధంగా, మొదట వరాహస్వామి జ్ఞానాన్ని కలిగిస్తున్నాడు. దీనిమూలంగా "శ్రీమన్నారాయణుడే ఆదిదేవుడు, ఆ స్వామి శ్రీ చరణాలు అతనిని పొందించే ఉపాయం" అనే స్థిరమైన నమ్మకాన్ని పొంది, ఆచార్యుని మూలంగా స్వామి శ్రీచరణాలను ఆశ్రయించాలి. ఈ విషయాన్ని నమ్మాళ్వార్లు,

**“ఏనమాయ్ నిలం కీండ ఎన్నప్పనే! కణ్ణా!,**
**ఎన్రుం ఎన్నై ఆళుడై, వాన నాయగనే!, మణి మాణిక్క చ్చుడరే,**
**తేనమాం పొళ్ళిల్ తణ్ శిరీవర మంగలత్తవర్, కై తొళ్ళవుఱై,**
**వాన మామలైయే!, అడియేన్ తొళ్ళ వందరుళే”** (తిరువాయ్ మొళ్ళి-5-7-6)

అనే పాశురంలో "మహావరాహ రూపాన్ని ధరించి, ప్రళయజలంలో మునిగిన భూమిని ఉద్ధరించావు. సంసార సముద్రంలో మునిగిన నన్ను ఉద్ధరించావు. భూమికి సహాయపడడం నాకు సహాయపడినట్లే. శ్రమను తీర్చే వానమామలై క్షేత్రంలో ఉండేవారి సేవలను స్వీకరిస్తున్నావు. వానమామలస్వామీ! నేను కూడా నీ సేవలు చేసి తరించాలి" – అని వరాహస్వామిని వానమామలై క్షేత్రంలోని స్వామిగా భావించి శరణు పొందారు, ఈ పాశురంలో. జ్ఞానప్పిరాన్ జ్ఞానాన్ని ఇచ్చి, ఆ జ్ఞానానికి ప్రయోజనమైన శరణాగతిని కూడా మనం మరువకుండా ఉండేటట్లు చేస్తున్నాడు; సహాయపడుతున్నాడు.

భగవద్రామానుజుల సంప్రదాయాన్ని అనుసరించి ఏ జన్మలో శరణాగతిని చేస్తున్నామో, అదే చివరి జన్మ. ఆ జన్మ చివరలో ఆ శరీరాన్ని విడిచి, అర్చిరాది మార్గం ద్వారా ప్రయాణం చేసి, శ్రీ వైకుంఠాన్ని చేరి, అంతులేని ఆనందాన్ని పొందుతున్నాము. ఏనాడో మనం చేసిన శరణాగతిని మనం మరచిపోయినా, భగవంతుడు మాత్రం దానిని మరువకుండా, తన మనసులో పెట్టుకుంటాడు. కఠినమైన భక్తిమార్గాన్ని ఆచరించేవారు మరణశయ్యపై కూడా మరువకుండా

భగవంతుని ధ్యానించినప్పుడే పరమపదం సిద్ధిస్తుంది. అయితే, శరణాగతి మాత్రం **"అప్పొ్ఴుదైక్కు ఇప్పొ్ఴుదే శొల్లివైత్తేన్"** (ఆ సమయంలో చెప్పవలసినది ఇప్పుడే చెప్పాను – అని పెరియాఴ్వార్ పలికినట్లుగా, ప్రాణం పోయే సమయంలో భగవంతుని భావించడం మరచిపోయినా, అతడు మనలను మరువకుండా గుర్తుపెట్టుకుని, మోక్షానికి తీసుకునిపోతాడు. కంచి వరదరాజస్వామి భగవద్రామానుజులకు అనుగ్రహించిన ఆరు వార్తలలో **"అంతిమ స్మృతి వర్జనమ్"** అని శరణాగతి చేసినవానికి అంతిమ సమయంలో భగవంతుని స్మరించవలసిన అవసరం లేదు — అని అన్నాడు. శరణాగతియొక్క ఈ సౌలభ్యాన్ని చాటింపు వేయడానికి ఇంతకంటే ఇంకొక ఏ సాక్ష్యం కావాలి? భగవంతుడు మనకు ఇచ్చే ఈ విశ్వాసాన్నే వరాహ చరమశ్లోకం మనకు తెలుపుతున్నది, – అని ఆ శ్లోకం కీర్తింపబడుతున్నది.

**"స్థితే మనసి సుస్వస్థే శరీరే సతి యో నరః, ధాతుసామ్యే స్థితే స్మర్తా విశ్వరూపం చ మామజమ్, తతస్తం మ్రియమాణంతు కాష్ఠపాషాణ సన్నిభమ్, అహం స్మరామి మద్భక్తం నయామి పరమాం గతిమ్"** అనేది వరాహ చరమశ్లోకం. "ఏ మానవుడు తన మనసు, శరీరం, ఆత్మ స్థిరంగా ఉండే సమయంలో లోకాన్ని శరీరంగా కలిగిన నా విషయంలో శరణు పొందుతాడో, అతడు మరణశయ్యపై కట్టె వలె, రాయి వలె పడి ఉండి, ఏ స్మరణ లేకండా ఉండేటప్పుడు, నేను అతనిని మరువకుండా స్మరించి, అతనిని గ్రహించి పరమపదానికి తీసికొనిపోతాను" – అనే నమ్మకాన్ని వరాహస్వామి ఈ సూక్తుల ద్వారా కలిగిస్తున్నాడు.

ఈ నమ్మకం ఏనాడు సడలిపోనిది – అనే విషయాన్ని గోదాదేవి **"పేశి యిరుప్పనవుమ్ పేర్క్కవుమ్ పేరాదే"** (నాచ్చియార్ తిరుమొ్ఴి—11—8) అనే సూక్తి లో వ్యక్తం చేశారు. భూదేవిని ఉద్ధరించి ఆమె ప్రార్థనకు అంగీకరించి, బిడ్డలమైన మనకోసం వరాహస్వామి ఉపదేశించినదే వరాహ పురాణం. అందులో ఉన్నది వరాహ చరమశ్లోకం.

గోదాదేవి భూదేవి యొక్క అవతారం అయినందున వరాహస్వామి విషయంలో, ఆ స్వామి పలికిన సూక్తుల విషయంలో అచంచలమైన నమ్మకాన్ని పొందినది. మనం ఆ స్వామిని

మరువకుండా తలిస్తే, అతడు మనకు జ్ఞానాన్ని కలిగించి, ఆ జ్ఞానానికి ఫలంగా ఆ స్వామి శచరణాలలో శరణాగతిని చేయించి, శరణాగతి చేసినవారే అతనిని మరిచినా, తాను మరువకుండా వారికి మోక్షం ఇచ్చే విలక్షణమైన దేవుడు. ఈ వరాహస్వామి కంటే వేరొక గొప్ప శరణం మనకు ఎక్కడా కనిపించదు.



**శ్రీఆదివరహస్వామి కల్లిడైకురిచ్చి (తిరుకరంధై)**

## పెరియాళ్వార్ల ఆచార్యుడు వరాహస్వామి:

"**గురుముఖ మనధీత్య**" అనే విధంగా ఎవరి వద్దా అధ్యయనం చేయకుండానే భగవదనుగ్రహం చేత పొందిన పాండిత్యంతో పెరియాళ్వార్లు పాండ్యరాజ సభలో ప్రతివాదులను ఓడించి, పరతత్వాన్ని స్థాపించారు – అనే విషయం వారి చరిత్రలో ప్రసిద్ధం. అయితే, ఈ విధంగా ఏ ఆచార్య సన్నిధిలోను అధికరించకుండా తమకు అంతటి పాండిత్యం ఏ విధంగా వచ్చింది? – అనే రహస్యాన్ని పెరియాళ్వార్లు తమ ప్రబంధంలో ఒక సూక్తి ద్వారా

వెల్లడించారు. **"ఎయిర్రిడై మణ్ కొండ ఎందై ఇరాప్పకల్ ఓదువిత్తు ఎన్నై ప్పయిర్రి ప్పణిశెయ్యక్కొండాన్"** (5—2—3) (తన దంతంతో భూమిని ఉద్ధరించిన తండ్రి, రాత్రి–పగలు నేర్పించి, నన్ను తన కైంకర్యంలో ఉపయోగించుకున్నాడు) అనే సూక్తివల్ల ఈ విషయం స్పష్టమవుతున్నది.

## మనం దర్శించే గొప్ప హితం:

ఏదైనా ఒక వస్తువు మనకు మంచిని కలుగజేస్తే, దానిని మంచిది అని పొగడుతాము. మంచిది అనేది ప్రియంగాను, హితంగాను ఉండాలి. అంటే, మనకు చిరకాలం మంచిని చేసేదిగా, అదే సమయంలో భోగ్యంగా ఉండాలి. లోకంలో మంచిది అంతా మధురంగానే ఉంటుంది అనిగాని, భోగ్యమైనవి అన్నీ మంచిని కలుగజేసివిగా ఉంటాయి అనిగాని చెప్పలేము. ఉదాహరణకి సత్యం అనేది మంచిని కలిగిస్తుంది. ఆ విధంగానే వేపాకు శరీరానికి మంచిని కలిగిస్తుంది. అయితే ఇవి మధురమైనవిగా ఉండవు కదా! పలు ఆహారపదార్థాలు మధురంగా ఉంటాయి. కానీ వాటిని భుజిస్తే శరీరానికి మంచిని కలిగించవు. వ్యాధికి కారణం అవుతాయి. తన బిడ్డ హితంలో తండ్రికి అధికంగా దృష్టి ఉంటుంది. తల్లికి తన బిడ్డకు ప్రియమైనవి ఇవ్వడంలో దృష్టి ఉంటుంది. తల్లి, తండ్రీ కలసి తన బిడ్డకు సమానమైన అవధిలో ప్రియాన్ని, హితాన్ని కలుగజేయాలి.

వరాహస్వామి, లక్ష్మీ వరాహస్వామి, భూవరాహస్వామి తానే తల్లిగా తండ్రిగా వర్తించి, ప్రియాన్ని, హితాన్ని కలుగజేస్తున్నాడు. అందువల్లనే వరాహస్వామిని నమ్మాళ్వార్లు **"నాన్ కండ నల్లదువే"** అని తాము దర్శించిన హితంగా పలికారు.

అంతేకాక, మంచిది అనేది శరీరానికి, ఆత్మకు రెండిటికీ  మంచిని కలుగజేయాలి. వరాహస్వామికి కల గొప్ప తిరుమేనిని, బలమైన బాహువులను, విశాలమైన వక్షస్సును, భూమిని ఉద్ధరించి కాపాడిన సాటిలేని స్వభావాన్ని, అసురులను సంహరించిన సామర్థ్యాన్ని భావిస్తే మనకు కల శరీర వ్యాధులు, సోమరితనం తొలగిపోతాయి. మనం ప్రయత్నించే పని ఏదైనా దానిలో

మనకు శ్రద్ధ, జయం కలుగుతాయి. వరాహస్వామి చాలా తక్కువ జాతిలో అవతరించిన సౌలభ్యాన్ని, ఇతరుల దుఃఖాన్ని చూచి సహించలేక పరిగెత్తి వచ్చే కరుణను కలవాడు. శ్రీముష్ణం క్షేత్రంలో వరాహజాతికి ప్రియమైన తుంగముస్తె దుంపలు ఆరగించడం కోసం సిద్ధపడే ఆ స్వామి స్వభావం మొదలైనవానిని ధ్యానిస్తే, మనకు ఆత్మజ్ఞానం కలిగి, ఆ స్వామి విషయంలో భక్తి కలిగి, అతని పాదాలలో శరణాగతి చేసి, హితాన్ని పొందుతాము. "ఈ శరీరం, ఆత్మ ఆ స్వామిదే" – అనే భావమే మనం దర్శించదగిన హితం.

వరాహ స్వామిలో ఉండే ఒక్కొక్క స్వభావాన్ని మనం శ్రద్ధగా గమనించి, మనసులో ధ్యానించాలి. వాటిలో కొన్ని ఇక్కడ ప్రస్తావింపబడుతున్నాయి.

వికారమైన శరీరంతో ఏ జాతిలో పుట్టినా, ఏ దోషం లేదు. ప్రేమ, భక్తి లేకుండా పగతో, కక్షతో ప్రవర్తించడమే దోషం.

ఇతరుల దుఃఖాన్ని చూచి సహించలేక, వీలైనంతవరకూ వారికి సహాయపడడమే శ్రీవైష్ణవం.

మంచి కార్యాలలో, భగవానుని పాదాలలో స్థిరమైన నమ్మికతో 'మనం చేస్తున్నాము' అనే గర్వం లేకుండా అభినివేశాన్ని పొందితే, అవి ఉన్నతమైన ఫలాలను ఇచ్చి, శరీరానికి, ఆత్మకు మంచిని కలిగిస్తాయి.

నమ్మాళ్వార్లు తాము దర్శించిన హితమని వరాహస్వామిని, దాని మూలంగా పూర్వం తెలుపబడిన మంచి ప్రవర్తనలను మనకు ఉపదేశించారు – అనే విషయం గుర్తుపెట్టుకో తగినది.

ఎన్ని సంవత్సరాలు, ఎంత మంది మానవులు కలసి విచారించినా సులభంగా తెలుసుకోవడానికి సాధ్యం కాని భగవంతుని ఇంత సులభంగా మనకు దర్శింపజేసిన నమ్మాళ్వార్లే మనం దర్శించిన హితం – అని చెప్పడంలో అడ్డులేదు.



# దివ్యప్రబంధాలలో వరాహావతార వైభవం

నాలాయిర దివ్యప్రబంధంలో వరాహస్వామి అవతారవైభవం ప్రస్తావింపబడిన పాశురాలు, వాటిభావాలతోపాటు క్రమానుసారంగా ఇవ్వబడుతున్నాయి.

**పెరియాళ్వార్ తిరుమొళి:**

1) **వానత్తు ఎழுన్ద ★ మழை ముగిల్ పోల్ ★ ఎంగుమ్**
**కానత్తు మేయందు ★ కళిత్తు విళైయాడి ★**
**ఏనత్తు ఉరువాయ్ ★ ఇడంద ఇమ్మణ్ణినై ★**
**తానత్తే వైత్తానాల్ ఇన్స్తు ముట్రుమ్ ★ తరణి ఇడందానాల్ ఇన్స్తు ముట్రుమ్ ॥ 2.10.9 ॥**

ఆకాశంలో నీరు నిండుగా తాగిన నల్లని మేఘంవలె నల్లని గొప్ప శరీరంతో అడవిలో తన ఇష్టానుసారంగా తిరుగుతూ ఉండే వరాహరూపుడు మా స్వామి. భూదేవిని అపహరించి, సముద్రంలో దాగిన హిరణ్యాక్షుడు అనే అసురుని చంపి, భూమిని మళ్లీ దాని స్థానంలో ఉంచిన ఆ స్వామి చేతిలో మేము బాధపడుతున్నాము. భూమిని ఉద్ధరించిన ఆ స్వామివల్లనే మేము ఈనాడు బాధపడుతున్నాము.

2) **వానత్తిల్ ఉళ్ళీర్! వలియీర్ ఉళ్ళీరేల్ ★**
**అఱైయో! వందు వాంగుమిన్ ఎన్బవన్ పోల్ ★**
**ఏనత్తురువాగియ ఈశన్ ఎందై ★**
**ఇడవన్ ఎழ வాంగి ఎడుత్త మలై ★**
**కాన క్కళి యానై తన్ కొంబిழన్దు ★**
**కదువాయ్ మదమ్ శోర త్తన్ కై ఎడుత్తు ★**

**కూనల్ పిఱై వేండి అణ్ణాందు నిఱ్కుమ్ ★**
**కోవర్తనం ఎన్నుమ్ కొ*ఱ్ఱ* క్కుడైయే ॥ 3.5.5 ॥**

"స్వర్గలోకంలో నివసించే ఓ దేవతలారా! మీరు నిజంగా బలం కలవారైతే ఇక్కడకు వచ్చి ఈ కొండను ఎత్తండి" అని వరాహమూర్తి దేవతలతో అన్నట్లుగా, నా స్వామి చిన్న మట్టిగడ్డవలె పైకి పెకలించి ఎత్తిన కొండ ఈ గోవర్ధన పర్వతం. అడవిలోని మదపుటేనుగు తన దంతం భగ్నం కాగా, దానివల్ల మదజలం కారుతూ ఉండగా, తన తొండాన్ని పైకెత్తి, చంద్రవంకను చూసి, విరిగిన దంతం అని భ్రమపడి, ఆ ప్రాంతంలో తిరుగుతుందట. అదే గోవర్ధన పర్వతం అనే గొడుగు.

3) **మణ్ణు మలైయుమ్ మఱి కడల్గళుమ్ ★ మఱ్ఱుమ్ యావుమ్ ఎల్లామ్ ★**
**తిణ్ణమ్ వి*ழు*మ్ గి ఉమి*ழ్*న్ద తేవనై ★ శిక్కెన నాడుదిరేల్ ★**
**ఎణ్ణుక్కరియదోర్ ఏనమ్ ఆగి ★ ఇరునిలమ్ పుక్కిడందు ★**
**వణ్ణ క్కరుంగు*ழ*ల్ మాదరోడు ★ మణందానై క్కండార్ ఉళర్ ★ ॥ 4.1.9 ॥**

భూమిని, పర్వతాలను, కెరటాలను కల సముద్రాలను, ఇంకా మిగిలిన అన్ని వస్తుసమూహాన్ని ప్రళయం నుండి రక్షించడంకోసం తన కడుపులో ఉంచుకుని కాపాడి, ఆ ఆపద తొలగిపోగానే బయటకు వెలువరించిన వాసుదేవుని వెతుకుతున్నారా?, అయితే నేను చెప్పేది వినండి. వాక్కుకు, మనస్సుకు అందని గొప్పతనం కలిగిన వరాహస్వామిగా అవతరించి, మహాసముద్రంలో మునిగిన భూమిని పైకి తెచ్చేటప్పుడు భూదేవి ఆలింగనం చేసుకున్న దృశ్యాన్ని ఆ వాసుదేవుని రూపానికి బదులుగా దర్శించినవారు ఎందరో ఉన్నారు సుమా!

4) **కోట్టు మణ్ కొండిడందు ★ కుడంగైయిల్ మణ్ కొండళందు ★**
**మీట్టుమ్ అదుండుమి*ழ్*న్దు ★ విళైయాడుమ్ విమలన్ మలై ★**

**ఈట్టియ పల్ పొరుళ్గళ్ ★ ఎంబిరానుక్కడియుళై ఎన్దు ★**

**ఓట్టరుమ్ తణ్ శిలంబాఱుడై ★ మాలిరుంజోలైయదే ★ ॥ 4.3.9 ॥**

భగవంతుడు ఆదివరాహస్వామిగా అవతరించి, తన పదునైన కోరలతో భూమిని పైకి ఉద్ధరించాడు. వామనమూర్తిగా అవతరించి, మూడు అడుగులతో భూమిని యాచించి పొంది, మళ్ళీ ఆ భూమండలాన్ని ఒకానొక సమయంలో లోపలకు మింగి, తరువాత ప్రళయం తీరిపోగానే బయటకు వెలువరించి, ఆనందమయుడై, విమలుడైన స్వామి సంచరించే పర్వతం తిరుమాలిరుంశోలై. సుగంధ ద్రవ్యాలను సమీకరించుకొని ఆ పరమాత్మకు సమర్పించే చల్లని నీరు కలిగిన నూపుర గంగానది ప్రవహించే పర్వతం తిరుమాలిరుంశోలై.

5) **వల్ ఎయిఱ్ఱు క్కేழலుమాయ్ ★ వాళ్ ఎయిఱ్ఱు చ్చీయముమాయ్ ★**
**ఎల్లై ఇల్లా త్తరణియైయుమ్ ★ అవుణనైయుమ్ ఇడందాన్ ఊర్ ★**
**ఎల్లియమ్ పోదిరుంజిఱై వండు ★ ఎమ్ పెరుమాన్ కుణమ్ పాడి ★**
**మల్లిగై వెణ్ శంగూదుమ్ ★ మదిళ్ అరంగమ్ ఎన్బదువే ॥ 4.8.8 ॥**

ఆ భగవంతుడు, వరాహమూర్తిగా అవతరించి, తన కోరదంతాలతో భూమిని ఉద్ధరించాడు. హిరణ్యకశిపుని వక్షాన్ని తన గోళ్ళతో చీల్చి, సంహరించాడు. ఆ పరమాత్మ ఇప్పుడు శ్రీరంగంలో వెలసి ఉన్నాడు. తెల్లని శంఖం ఊదినపుడు వచ్చే ధ్వనివలె వినిపించే, ఉద్యానవనాలలో మల్లె పువ్వుల చుట్టూ చేరి తుమ్మెదలు చేసే తీయని ఝుంకార ధ్వనులను చూస్తే అవి శ్రీరంగనాథుని స్తుతించే రీతిగా వినడానికి చాలా మధురంగా ఉన్నాయి.

6) **తోట్టమ్ ఇల్లవళ్ ఆత్తొழ ఓడై ★ తుడవైయుమ్ కిణఱుమ్ ఇవై ఎల్లామ్ ★**
**వాట్టమ్ ఇన్ఱి ఉన్ పొన్నడి క్కీழే ★ వళైప్పగమ్ వగుత్తు క్కొండిరుందేన్ ★**

**నాట్టు మానిడత్తోడెనక్కరిదు ★ నచ్చువార్ పలర్ కేళ్గిల్ ఒన్గాగి ★**
**కోట్టు మణ్ కొండ కొళ్ గైయినానే! ★ కుంజరమ్ వీళ్గ క్కొంబొశిత్తానే! ॥ 5.1.5 ॥**

తోటలు, ఇళ్ళు, పశువుల శాలలు, సరస్సులు, విహరించే చోట్లు, తోటబావి మొదలైనవి అన్నిటిని ఏమాత్రం కొరత లేకుండా నీ పాదాల వద్ద సమర్పించాను. ఇక లోకులతో సహవాసం నాకు ఏమాత్రం రుచించదు. కానీ, చాలామంది దీనినే ఇష్టపడతారు. మహావరాహమై అవతరించి, నీ కోరలతో భూమిని ఉద్ధరించిన స్వామీ!, కువలయాపీడం అనే ఏనుగు యొక్క దంతాన్ని విరిచి, దానిని సంహరించిన కృష్ణా!, నన్ను రక్షించు.

7) **వయిఱ్ఱిల్ తొ ౦ట్రువై ప్పిరిత్తు ★ వన్ పుల చ్చేవై అదక్కి★**
**కయిట్రుమ్ అక్కాణి కళ్గిత్తు ★ కాలిడై ప్పాశమ్ కళ్గిఱ్ఱి ★**
**ఎయిఱ్ఱిడై మణ్ కొండ ఎందై ★ ఇరాప్పగల్ ఓదువిత్తు ★ ఎన్నై**
**ప్పయిఱ్ఱి ప్పణి శెయ్య క్కొండాన్ ★ పండన్రు పట్టినమ్ కాప్పే ॥ 5.2.3 ॥**

వరాహమూర్తిగా అవతరించి, తన పదునైన కోరలతో భూమిని ఉద్ధరించిన శ్రీనాథుడు, నాకు ఇంకొక జన్మ లేకుండా చేశాడు. ఐదు ఇంద్రియాలు అనే బలమైన ఎద్దులను అణిచివేసి, నరాలు, ఎముకలు కల శరీరంలోని ఆశను నాకు లేకుండా చేసి, యమపాశం నుండి విడిపించి, రాత్రి, పగలు నాకు జ్ఞానాన్ని బోధించాడు. నన్ను తన నిత్య కైంకర్యం చేసేటట్లు ప్రోత్సహించి, ఉజ్జీవింపజేశాడు. నా ఆత్మ పూర్వంవలే లేదు. ఇప్పుడు స్వామిరక్షణను పొందినది అయినది.

## నాచ్చియార్ తిరుమొళ్గి

8) **పాశి తూర్తు క్కిడంద పార్ మగట్కు ★ పండొరునాళ్**
**మాశుడంబిల్ నీర్ వారా ★ మానమ్ ఇలా ప్పన్రియామ్ ★**

**తేశుడైయ తేవర్ ★ తిరువరంగ చ్చెల్వనార్ ★**

**పేశి ఇరుప్పనగళ్ ★ పేర్కవుమ్ పేరావే ॥ 11.8 ॥**

వరాహమూర్తిగా అవతరించి, పూర్వం నీటి అడుగున పాచిపట్టిన భూమిని ప్రళయ కాలంలో, బురద నిండిన శరీరంతో ఉద్ధరించాడు. అప్పుడు తేజోమయుడైన ఆ శ్రీరంగనాథుడు భూదేవితో పలికిన 'నేను నిన్ను వదిలిపెట్టను, నీపై ఉండే ప్రేమ ఏమాత్రం తగ్గదు' అని ఈవిధంగా పలికిన సూక్తులు నా మనసులో దృఢంగా నిలిచిపోయాయి. ఇక ఏ మాటలూ నేను వినలేను.

**<u>పెరుమాళ్ తిరుమొ*ழி*:</u>**

9) **ఏ*ழ*డర్తదుమ్ ఏనమాయ్ నిలమ్ కీండదుమ్ ★ మున్ ఇరామనాయ్ ★**
**మాఱడర్తదుమ్ మణ్ అళందదుమ్ ★ శొల్లి ప్పాడి ★ వణ్ పొన్ని ప్పేర్**
**ఆఱు పోల్ వరుమ్ కణ్ణ నీర్ కొండు ★ అరంగన్ కోయిల్ తిరు ము*ற்ற*మ్ ★**
**శేఱు శెయ్ తొండర్ శేవడి ★ శె*ழு*మ్ శేఱెన్ శెన్నిక్కణివనే ॥ 12.3 ॥**

ఏడు ఎద్దులను సంహరించడం, వరాహమూర్తిగా అవతరించి భూమిని పైకెత్తడం, శ్రీరామావతారంలో రావణుని సంహరించడం, త్రివిక్రముడై భూమిని కొలవడం మొదలైన భగవంతుడు చేసిన గొప్ప కార్యాలను పలుకుతూ, భక్తి అధికం కాగా పాడుతూ, భాగవతులు ఆనందభాష్పాలు స్రవిస్తారు. అపుడు శ్రీరంగం కోవెల ముంగిలి అంతా తడిసి బురదతో నిండిపోతుంది. వారి పాదాలతో ఈ విధంగా ఏర్పడిన ఆ బురదను నేను నా తలకు అద్దుకొని తరిస్తాను.

## తిరుచ్చన్దవిరుత్తమ్:

10) **పడైత్త పార్ ఇడందళందు ★ అదుండుమిழ்న్దు పౌవనీర్ ★**
**పడైత్తడైత్తదిల్ కిడందు ★ మున్ కడైంద పెற்றியోయ్**
**మిడైత్త మాలి మాలిమాన్ ★ విలంగు కాలన్ ఊర్ పుగ ★**
**పడైక్కలమ్ విడుత్త ★ పల్ పడై త్తడక్కై మాయనే! ॥ 28 ॥**

సృష్టించిన భూమిని కొలిచి, దానిని లోపలకు గ్రహించి, తరువాత ప్రళయకాలం తీరగానే దానిని బయటకు వెలువరించి, సముద్రానికి సేతువు కట్టి, పాలసముద్రంలో శయనించి, పాలముద్రంలో మందర పర్వతంతో చిలికిన గొప్ప మహిమ కల స్వామీ!, మాలి, సుమాలి అనే రాక్షసులను వారు యమలోకం చేరేటట్లు నీవు ఆయుధాలను ప్రయోగించావు. పలు దివ్యాయుధాలను ధరించిన, పొడుగైన బాహువులను కల మాయాస్వరూపీ!, నిన్ను ఎవరు తెలుసుకోగలరు?

11) **కాయ్ త్త నీళ్ విళంగని ఉదిర్తు ★ ఎదిర్ న్ద పూంగురుందమ్**
**శాయ్ త్తు ★ మా పిళంద కైత్తలత్త ★ కణ్ణన్ ఎన్బరాల్ ★**
**ఆయ్ చ్చి పాలై ఉండు మణ్ణై ఉండు ★ వెణ్ణెయ్ ఉండు ★ పిన్**
**పేయ్ చ్చి పాలై ఉండు ★ పండోర్ ఏనమ్ ఆయ వామనా! ॥ 37 ॥**

వామనా!, కాయలతో నిండిన, ఎత్తుగా ఉండే వెలగచెట్టులోని కాయలను అన్నిటినీ రాలగొట్టావు. నిన్ను ఎదిరించిన కుందవృక్షంలో ఆవేశించి ఉండే రాక్షసుని పడగొట్టావు. అశ్వరూపంలో వచ్చిన కేశి అనే అసురుని చంపావు. శ్రీకృష్ణుడు అనే పేరును పొందావు. యశోదాదేవి స్తన్యాన్ని ఆరగించావు. వెన్నను తిన్నావు. పూతన పాలను తాగావు. పూర్వం, అద్వితీయమైన వరాహమైనావు.

12) కున్టిల్ నిన్టు వాన్ ఇరుందు ★ నీళ్ కడల్ కిడందు ★ మణ్
ఒన్టు శెన్ట తొన్టై ఉండు ★ అదొన్టిడందు పన్టియాయ్ ★
నన్టు శెన్ట నాళవట్రుళ్ ★ నల్లుయిర్ పడైత్తవర్కు ★
అన్టు తేవ మైత్తళిత్త ★ ఆది తేవన్ అల్లైయే ॥ 48 ॥

తిరుమలలో నిలిచి ఉండి, వైకుంఠంలో కూర్చుండి, పాలసముద్రంలో పరుండి, త్రివిక్రముడవై ఈ భూమండలాన్ని వ్యాపించావు. ఒకానొక సమయంలో ఈ భూమిని మింగావు. ఇంకొకసారి వరాహరూపాన్ని ధరించి, భూమిని సముద్రంనుండి పైకి తీశావు. చక్కని వరాహకల్పంలో మానవులను సృష్టించి, వారు వారు తమ తమ అభిరుచులకు తగినట్లుగా ఆరాధించే దేవతలను కూడా సృష్టి చేశావు. ఈ విధంగా ప్రజలకు మంచిని కలిగించి, ఆశీర్వదించిన ఆదిదేవుడవు నీవే కదా!

13) నడంద కాల్గళ్ నొందవో ★ నడుంగ ఞాలమ్ ఏనమాయ్ ★
ఇడంద మెయ్ కులుంగవో ★ విలంగు మాల్ వరై చ్చురమ్ ★
కడంద కాల్ పరంద ★ కావిరి క్కరై క్కుడందైయుళ్ ★
కిడందవాఱెழுన్దిరుందు పేశు ★ వాழி కేశనే! ॥ 61 ॥

శ్రీరామావతారంలో, నడచిన నీ కాళ్ళకి నొప్పి కలిగిందా? భూదేవికి కలిగిన దుఃఖాన్ని తీర్చడంకోసం వరాహమై అవతరించి ఆమెను పైకెత్తినపుడు, నీ మేనికి శ్రమ కలిగిందా? అడ్డంగా ఉండే కొండలు, నీటితో ఉండే ప్రదేశాలు దాటి వచ్చి, చివరకు కావేరీ నదీ తీరంలో ఉండే తిరుక్కుడన్దై అనే దివ్యదేశంలో శయనించావు. ఈ విషయాన్ని నాకు కొంచం తెలుపు. కాస్త లేచి వివరించు. కేశవా!, నీకు మంగళం.

14) **విళ్వీలాద కాదలాల్ ★ విళంగు పాద పోదిల్ వైత్తు ★**
**ఉళ్ళు వేనదూన నోయ్ ★ ఒ*ఝి*క్కుమా తె*ఝి*క్కు నీర్**
**పళ్ళి మాయ పన్ది ఆయ ★ వెన్ది వీర ★ కున్దినాల్**
**తుళ్ళునీర్ వరంబు శెయ్ ద ★ తోన్దల్ ఒన్టు శొల్లిడే ॥ 102 ॥**

కెరటాలు ఎగసిపడే సముద్రంలో పరుండిన స్వామీ!, వరాహమూర్తిగా అవతరించి, జయించే స్వభావాన్ని కలవాడా!, పొంగి ప్రవహించే సముద్రంలో పెద్ద పెద్ద రాళ్ళతో సేతువును కట్టిన రామచంద్రా!, భక్తితో, ప్రకాశించే నీ పాదపద్మాలలో నేను నా మనస్సును నిలిపి, నిత్యం భావిస్తున్నాను. నా శారీరకమైన బాధలను లేకుండా చేసికొనే దారులలో ఏదైనా ఒక్క దారిని అయినా నాకు ఉపదేశించు.

15) **ఈనమాయ ఎట్టుమ్ నీక్కి ★ఏదమ్ ఇన్ది మీదు పోయ్ ★**
**వానమ్ ఆళ వల్లైయేల్ ★ వణంగి వా*ఝి*త్తు ఎన్నెంజమే ★**
**ఞానమ్ ఆగి ఞాయిఱాగి ★ ఞాల ముట్రుమ్ ఓర్ ఎయిట్రు ★**
**ఏనమాయ్ ఇడంద మూర్తి ★ ఎన్దై పాదమ్ ఎణ్ణియే ॥114॥**

చాలా నీచమైనవి, జ్ఞానం కలుగకుండా అడ్డుపడేవి అయిన కామం, క్రోధం, లోభం, మోహం, మదం, మాత్సర్యం, అసూయ, అజ్ఞానం అనే ఆ ఎనిమిది దోషాలను మనసులో నుండీ తరిమికొట్టి, సంసారంలో కలిగే దుఃఖాలను అన్నిటినీ పోగొట్టుకొని పరమపదంలో నివసించే అదృష్టాన్ని పొందాలని నీకు అభిప్రాయం ఉంటే, ఆ భగవంతుని ఆరాధించు. ఓ మనసా!, ఆత్మజ్ఞానాన్ని ఇచ్చేవాడు, మనస్సుకు వికాసాన్ని కలిగించే సూర్యుడు ఆ భగవానుడే! వరాహమూర్తియై అవతరించి, భూమిని అంతటినీ తన దంతాలతో పైకి ఎత్తిన ఆ పరమాత్మ పాద పద్మాలను భావించి, కొలిచి, స్తుతించు.

## పెరియ తిరుమొழி:

16) **వెన్ఱియే వేండి వీழ் పొరుట్కిరంగి ★ వేఱ్కణార్ కలవియే కరుది ★**
**నిన్ఱవా నిల్లా నెంజినై ఉడైయేన్ ★ ఎన్ శెయ్ గేన్ నెడు విశుంబణవుమ్ ★**
**పన్ఱియాయ్ అన్ఱు పారగమ్ కీండ ★ పాழியాన్ ఆழியాన్ అరుళే ★**
**నన్ఱు నాన్ ఉయ్య నాన్ కండు కొండేన్ ★ నారాయణా ఎన్నుమ్ నామమ్ ॥1.1.4॥**

విజయాన్ని పొందాలని కోరి, నశించిపోయే విషయాలపై నా మనస్సును నిలిపి, పదునైన చూపులతో మనస్సును దోచే కాంతల పొందును కోరుకున్నాను. ఏమాత్రం నెమ్మదిలేని మనస్సుతో, సరైన దారి ఏదో తెలియకుండా సంచరిస్తున్నాను. ఈవిధంగా సందేహంలో పడి సంచరించే సమయంలో, లోకంలో అంతటా వ్యాపించినవాడు, సుదర్శనాన్ని ధరించినవాడు, పూర్వం వరాహావతారాన్ని ఎత్తి, భూమిని ఉద్ధరించినవాడు అయిన ఆ భగవానుని కృపచేత, నేను ఉజ్జీవించడానికి తగిన నారాయణ నామాన్ని గ్రహించాను.

17) **ఏన మునాగి ఇరు నిలమ్ ఇడందు ★ అన్ఱిణైయడి ఇమైయవర్ వణంగ ★**
**తానవన్ ఆగమ్ తరణియిల్ పురళ ★ తడంజిలై కునిత్త ఎన్ తలైవన్ ★**
**తేనమర్ శోలై క్కర్పగం పయంద ★ తెయ్ వ నల్ నఱు మలర్ కొణర్ న్దు ★**
**వానవర్ వణంగుమ్ కంగైయిన్ కరైమేల్ ★ వదరి ఆచ్చిరామత్తుళ్ళానే ॥ 1.4.1 ॥**

వరాహావతారాన్ని ఎత్తి, చాలా విశాలమైన ఈ భూమిని ప్రళయ సముద్రం నుండీ ఉద్ధరించిన నా స్వామి పాదపద్మాల జంటను దేవతలు నమస్కరిస్తారు. శ్రీరామచంద్రుని బాణాల ప్రభావాన్ని తట్టుకోలేక, దుష్టుడైన ఆ రావణుడు భూమిపై పడి నశించాడు. సువాసన నిండిన కల్పవృక్షాల పూలను వేసికొని వచ్చి, దేవతలు భక్తితో బదరీనాథునకు అర్చన చేస్తారు. ఆ స్వామి గంగానదీతీరంలో ఉండే 'బదరికాశ్రమం' అనే క్షేత్రంలో వేంచేసి ఉన్నాడు.

18) కిడందానై త్తడంగడలుళ్ పణంగళ్ మేవి ★ కిళర్ పొఱియ మఱి తిరియ అదనిన్ పిన్నే
పడర్ న్దానై ★ పడుమదత్త కళి*ఱ్ఱి*న్ కొంబు పఱిత్తానై ★ పార్ ఇడత్తె ఎయిఱు కీఱ
ఇడందానై ★వళై మరుప్పిన్ ఏనమ్ ఆగి★ఇరునిలనుమ్ పెరువిశుంబుమ్ ఎయ్ దా వణ్ణమ్
కడందానై ★ఎమ్మానై క్కండు కొండేన్★కడి పొ*ழி*ల్ శూ*ழ்* కడల్ మల్లై త్తల శయనత్తే
॥2.5.6॥

పాలసముద్రంలో శేషశాయిగా శయనించినవాడు, వేగంగా పరుగుదీసే మాయామృగాన్ని వెంబడించి దానిని చంపినవాడు, కువలయాపీడం అనే మదపుటేనుగు దంతాన్ని విరిచినవాడు, వరాహావతారం ఎత్తి విశాలమైన ఈ భూమిని పైకెత్తినవాడు, త్రివిక్రముడై, భూమి–ఆకాశాలలో అంతటా వ్యాపించినవాడు అయిన నా స్వామిని పరిమళం వెదజల్లే ఉద్యానవనాలు కల ‘తిరుక్కడల్ మల్లై’ అనే క్షేతంలో దర్శించాను.

19) ఏనత్తిన్ ఉరువాగి ★ నిల మంగై ఎ*ழி*ల్ కొండాన్ ★
వానత్తిల్ అవర్ ముఱైయాల్ ★ మగి*ழ்*న్దేత్తి వలమ్ కొళ్ళ ★
కానత్తిన్ కడల్ మల్లై ★ తల శయనత్తుఱైగిన్ఱ ★
ఞానత్తిన్ ఒళి ఉరువై ★ నినైవార్ ఎన్ నాయగరే ॥ 2.6.3 ॥

వరాహరూపంతో భూమిని ఉద్ధరించి, ఆమె శోభను భగవంతుడు ఆస్వాదించాడు. బ్రహ్మ మొదలైన దేవతలు శాస్త్రక్రమాన్ని అనుసరించి స్తుతించగా, వారిని అనుగ్రహించాడు. ఆ స్వామి, ‘తిరుక్కడల్ మల్లై స్థలశయనం’లో జ్ఞానప్రకాశరూపుడై, దివ్యమంగళవిగ్రహం కలవాడై ప్రకాశిస్తున్నాడు. ఆ భగవానుని భక్తితో భావించేవారు నాకు స్వాములు.

20) ఇరుందణ్ మా నిలమ్ ఏనమ్ అదాయ్★ వళైమరుప్పినిల్ అగత్తొడుక్కి★
కరుందణ్ మా కడల్ కణ్ తుయిన్ఱవన్ ఇడమ్★కమల నల్ మలర్ తేఱల్

**అరుంది ★ ఇన్ ఇశై మురన్ఱెழுమ్ అళిగులమ్ పొదుళి ★ అమ్ పొழிలూడే★**
**శెరుంది నాణ్మలర్ శెన్ఱణైందుழிదరు ★ తిరువయిందిర పురమే ॥ 3.1.1 ॥**

భగవానుడు, విశాలమైన, చల్లని, గొప్ప భూమిని వరాహరూపుడై తన కోరలతో పైకెత్తి, పాలసముద్రంలో యోగనిద్రలో వేంచేసి ఉన్నాడు. తీయని రాగాలను ఆలపిస్తూ సంచరించే తుమ్మెదలను కల పూల తోటలు 'తిరువహీంద్రపురం' అనే దివ్యదేశంలో చాలా ఉన్నాయి. అక్కడ ఉండే తుమ్మెదలు ఇంకా ఇంకా మధువును ఆస్వాదించాలని అక్కడ ఉండే సురపొన్న వృక్షాల దగ్గరకు వెడుతున్నాయి. అటువంటి అందమైన తిరువహీంద్రపురం అనే క్షేత్రంలో స్వామి వేంచేసి ఉండి భక్తుల సేవలను స్వీకరిస్తున్నాడు.

21) **వెంబుమ్ శినత్తు ప్పున క్కేழல్ ఒన్ఱాయ్ ★ విరి నీర్ ముదు వెళ్ళమ్ ఉళ్ పుక్కழுన్ద ★**
**వంబుణ్ పొழిల్ శూழ் ఉలగన్ఱెడుత్తాన్ ★ అడిప్పోదణైవాన్ విరుప్పోడిరుప్పీర్ ★**
**పైంబొన్నుమ్ ముత్తుమ్ మణియుమ్ కొణర్ న్దు ★ పడై మన్నవన్ పల్లవర్ కోన్ పణింద ★**
**శెంబొన్ మణి మాడంగళ్ శూழ்న్ద ★ తిల్లై త్తిరుచ్చిత్తిరకూటమ్ శెన్ఱు శేర్మిన్ గళే ॥3.2.3॥**

పూర్వకాలంలో అద్వితీయమైన వరాహరూపాన్ని ధరించి, ప్రళయ సముద్రంలో ప్రవేశించి, భూమిని ఉద్ధరించి, బయటకు తెచ్చిన భగవంతుని శ్రీపాదాలను చేరాలనే ఆశకలిగిన జనులారా!, పల్లవ చక్రవర్తి, బంగారాన్ని, ముత్యాలను, మాణిక్యాలని తీసికొని వచ్చి భగవంతునకు సమర్పించి ఆరాధించే నగరం, బంగారంతో, రత్నాలతో పొదిగిన సౌధాలు ఉండే నగరం అయిన 'తిరుచిత్రకూటం' దివ్యక్షేత్రానికి వెళ్ళి, దర్శించి, ఆనందించండి.

22) **వైయణైంద నుది క్కోట్టు వరాగమ్ ఒన్ఱాయ్ ★**
**మణ్ ఎల్లామ్ ఇడందెడుత్తు మదంగళ్ శెయ్ దు ★**
**నెయ్ అణైంద తిగిరియినాల్ వాణన్ తిణ్ తోళ్ ★**

**నేర్ న్దవన్ తాళ్ అణైగిఱ్పీర్ ★ నెయ్ ద లోడు**
**మై అణైంద కువళైగళ్ తమ్ కణ్ణళ్ ఎన్ఱుమ్ ★**
**మలర్ క్కుముదమ్ వాయ్ ఎన్ఱుమ్ కడైశిమార్గళ్ ★**
**శెయ్ అణైందు కళై కళైయా తేఱుమ్ ★ కాழி**
**చ్చీరామ విణ్ణగరే శేర్మినీరే ॥ 3.4.3 ॥**

సాటిలేని వరాహరూపాన్ని ధరించి, భూమిని ప్రళయసముద్రంలోనుండీ బయటకు తెచ్చినవాడు, నేయిపూసినట్లు మెరిసే సుదర్శనచక్రంతో బాణాసురుని వేయి భుజాలను ఖండించినవాడు అయిన భగాంతుని పాదపద్మాలను చేరాలని కోరేవారలారా!, కర్షకవనితలు సస్యం పండే క్షేత్రాలలో కలుపు తీయడంకోసం వాటిలోకి దిగి, అక్కడ ఉండే నల్లకలువ పూలను తమ నేత్రాలుగా, ఎర్రకలువ పూలను తమ అధరాలుగా భావించి, కలుపు తీయకుండానే విరమించే అందమైన 'కాழி చ్చీరామ విణ్ణగరం' అనే దివ్యదేశాన్ని చేరి దర్శించండి.

23) **శిలంబిన్ ఇడై చ్చిఱు పరల్ పోల్ పెరియ మేరు ★**
**తిరు క్కుళంబిల్ కణగణప్ప త్తిరువాగారమ్**
**కులుంగ ★ నిల మడంద్రై తనై ఇడందు పుల్ గి ★**
**కోట్టిడై వైత్తరుళియ ఎమ్ కోమాన్ కండీర్ ★**
**ఇలంగియ నాన్ మఱై అనైత్తుం అంగమ్ ఆఱుమ్ ★**
**ఏழ் ఇశైయుమ్ కేళ్విగళుమ్ ఎణ్ తిక్కెంగుమ్ ★**
**శిలంబియ నఱ్ పెరుంజెల్వమ్ తిగழுమ్ నాంగూర్ ★**
**తిరుత్తెற்றியంబలత్తెన్ శెణ్ కణ్ మాలే ॥ 4.4.8 ॥**

వరాహమూర్తి, భూదేవిని ఉద్ధరించినపుడు ఆమె కాలి అందెలనుండి గణగణమని చప్పుడు వినిపించింది. శ్రీదేవి నివసించే స్వామి వక్షస్థలం, కదలాడింది. అపుడు, భగవంతుడు భూదేవిని

ఆలింగనం చేసుకుంటూ, ఆమె తన స్పర్శకు పారవశ్యాన్ని పొందుతూ ఉండగా, తన కోరదంతాలపై పెట్టుకొని పైకి తీసుకొని వచ్చాడు. ఆ స్వామి, ప్రకాశించే నాలుగు వేదాలను, ఆరు వేదాంగాలను, ఏడు రాగాలను, యజ్ఞయాగాదులను అధ్యయనం చేసే వైదికులు నివసించే, గొప్ప సంపద కలిగి ప్రకాశించే తిరునాంగూరులో ఉన్న 'తిరుత్తె*ర్రి* అంబలమ్' అనే క్షేత్రంలో వేంచేసి ఉన్నాడు.

24) **మణ్ ఇడందేనమ్ ఆగి ★ మావలి వలి తొలైప్పాన్ ★**
**విణ్ణవర్ వేండ చ్చెన్రు ★ వేళ్వియిల్ కుఱై ఇరందాయ్! ★**
**తుణ్ణెన మాట్రార్ తమ్మై ★ తొలైత్తవర్ నాంగై మేయ ★**
**కణ్ణనే ! కావళన్ తణ్ పాడియాయ్! ★ కళైగణ్ నీయే 4.6.2 ॥**

సముద్రంలో బాగా లోతుగా అడుగున ఉండే భూమిని, వరాహమూర్తిగా అవతరించి ఉద్ధరించిన స్వామీ!, దేవతలు ప్రార్థించగా వామనమూర్తిగా అవతరించి, బలి చక్రవర్తి యజ్ఞవాటికకు వెళ్లి, అతడి గర్వం అణచడం కోసం మూడు అడుగుల నేలను యాచించిన త్రివిక్రమా!, శత్రువులను వేగంగా జయించే వీరులు నివసించే తిరునాంగూరులోని 'తిరుక్కావళంబాడి' క్షేత్రంలో నిత్యనివాసం చేసే శ్రీకృష్ణా!, నీవే నాకు రక్షకుడవు.

25) **వారాగమ్ అదాగి ★ ఇమ్మణ్ణై ఇడందాయ్★**
**నారాయణణే! ★ నల్ల వేదియర్ నాంగూర్ ★**
**శీరార్ పొ*ళ్లి*ల్ శూ*ళ్లు* ★ తిరువెళ్ళ క్కుళత్తుళ్**
**ఆరావముదే ★ అడియేఱ్కరుళాయే ॥ 4.7.8 ॥**

వరాహమూర్తివై భూలోకాన్ని ఉద్ధరించిన నారాయణా!, గొప్ప వైదికులు నివసించే తిరునాంగూరులోని, అందమైన ఉద్యానవనాలు చుట్టూ కల 'తిరువెళ్ళక్కుళం' అనే క్షేత్రంలో ఉన్న అపర్యాప్తామృతమా!, దాసుని అనుగ్రహించు.

**26) పండు మున్ ఏనమ్ ఆగి అన్ఱొరుగాల్ ★ పార్ ఇడందెయిఱ్ఱినిల్ కొండు ★**
**తెణ్ తిరై వరుడ ప్పాఱ్కడల్ తుయిన్ఱ ★ తిరువెళ్ళియంగుడియానై ★**
**వండఱై శోలై మంగైయర్ తలైవన్ ★ మాన వేల్ కలియన్ వాయ్ ఒలిగళ్ ★**
**కొండివై పాడుమ్ తవమ్ ఉడైయార్గళ్ ★ ఆళ్వర్ ఇక్కురై కడల్ ఉలగే ॥ 4.10.10 ॥**

పూర్వం, వరాహమూర్తి రూపంలో ప్రళయకాలంలో భూమిని ఎత్తి, తన దంతాలపై పెట్టుకొని కాపాడినవాడు పాలసముద్రంలో శయనించాడు. 'తిరువెళ్ళియంగుడి' అనే దివ్యదేశంలో సాక్షాత్కరించే ఈ స్వామిని, తుమ్మెదలు మధురంగా ధ్వనించే వికసించిన పూలగుత్తులతో నిండిన ఉద్యానవనాలను చుట్టూ కల తిరుమంగై క్షేత్రానికి నాయకుడు, చేతిలో బల్లెం ధరించినవారు అయిన తిరుమంగై ఆళ్వార్ స్తుతిస్తూ, ఈ పది పాశురాలను పాడారు. వీటిని గానం చేసే తపస్సు కలవారు, కెరటాలను నిండుగా గల సముద్రాన్ని చుట్టూ కలిగిన ఈ భూమండలాన్ని పాలిస్తారు. ఇది నిజం.

**27) మాన వేల్ ఒణ్ కణ్ మడవరల్ ★ మణ్ మగళ్ అళుంగ్ద మున్నీర్ ప్పరప్పిల్ ★**
**ఏనమ్ ఆగి అన్ఱిరు నిలమ్ ఇడందవనే! ★ ఎనక్కరుళ్ పురియే ★**
**కాన మా ముల్లై కళై క్కరుంబేఱి ★ వెణ్ ముఱువల్ శెయ్ దలర్ గిన్ఱ**
**తేనిన్ వాయ్ మలర్ మురుగుగుక్కుమ్ ★ తిరువెళ్ళఱై నిన్ఱానే ॥ 5.3.5 ॥**

బల్లెంవలె పదునైన చూపులను ప్రసరించే నేత్రాలను కల భూదేవి, పూర్వం సముద్రంలో మునిగిపోగా, ఆమెను అప్పుడు నీవు వరాహమూర్తివిగా అవతరించి రక్షించావు. 'తిరువెళ్ళఱై' అనే దివ్యదేశంలో అడవి మల్లెపూల తీగలు మందహాసం చేస్తూ, తమ పూలలోని తేనెను తుమ్మెదల

నోటికి అందిస్తున్నాయి. ఈ విధంగా, సుందరమైన, మధురమైన దృశ్యాలను కలిగిన దివ్యదేశంలో వేంచేసి ఉండే స్వామీ!, నాపై దయ చూపించు.

**28) ఏన్ ఆగి ఉలగిడందు ★ అన్ఱిరు నిలనుమ్ పెరు విశుంబుమ్ ★**
**తాన్ ఆయ పెరుమానై ★ తన్ అడియార్ మనత్తెన్ఱుమ్ ★**
**తేన్ ఆగి అముదాగి త్తిగழ்న్దానై ★ మగిழ்న్దొరుగాల్ ★**
**ఆన్ ఆయన్ ఆనానై ★ కండదు తెన్ అరంగత్తే ॥ 5.6.3 ॥**

పూర్వం, వరాహరూపాన్ని ధరించి, లోకాన్ని ఉద్ధరించివాడుగా, భూమి, ఆకాశం తానే అయినవాడుగా, తన భక్తులకు తేనెవలె, అమృతంవలె తోచేవాడుగా, కృష్ణావతారంలో గోవులను కాచినవాడుగా ప్రకాశించిన నా స్వామిని నేను శ్రీరంగంలో కళ్ళారా, మనసారా దర్శించుకున్నాను.

**29) కిడంద నంబి కుడందై మేవి, కేழలాయులగై**
**ఇడంద నంబి ★ ఎంగళ్ నంబి ★ ఎఱిఇఴర్ అరణ్ అழియ ★**
**కడంద నంబి కడియార్ ఇలంగై ★ ఉలగై ఈర్ అడియాల్ ★**
**నడంద నంబి నామమ్ శొల్లిల్ ★ నమో నారాయణమే ॥ 6.10.1 ॥**

తిరుక్కుడందై అనే క్షేత్రంలో అందంగా శయనించి ఉండే గుణపూర్ణుడు, పూర్వం వరాహావతారాన్ని ఎత్తి భూమిని పైకెత్తినవాడు, మా కోరికలు తీర్చే పరిపూర్ణుడు, శత్రువుల కోట నాశనం అయ్యేటట్లు అసురులు నివసించే లంకను ధ్వంసం చేసినవాడు, అన్ని లోకాలను తన రెండు పాదాలతో కొలిచినవాడు – మన నారాయణనంబి. ఆ స్వామి నామాన్ని ఉచ్చరిస్తే అదే 'నమో నారాయణాయ' అనే గొప్ప మంత్రం అవుతుంది.

30) **విడందాన్ ఉడైయ అరవమ్ వెరువ ★ చెరువిల్ మున నాళ్ ★ మున్**
**తడన్ తామరై నీర్ ప్పొయ్ గై పుక్కు ★ మిక్క తాళాళన్**
**ఇడందాన్ వైయమ్ కేழల్ ఆగి ★ ఉలగై ఈర్ అడియాల్ ★**
**నడందానుడైయ నామమ్ శొల్లిల్ ★ నమో నారాయణమే ॥ 6.10.2 ॥**

చాలా భయంకరమైన విషాన్ని కలిగిన కాళీయుడు కూడా భయపడే విధంగా పూర్వం గోపబాలకుల ఎదుట మడుగులో దూకి, ఆ సర్పంతో పోరాడిన గొప్ప పాదాలను కలవాడు, వరాహమూర్తిగా అవతరించి, భూమిని ఉద్ధరించినవాడు, రెండు పాదాలతో అన్ని లోకాలను కొలిచినవాడైన స్వామినామాన్ని ఉచ్చరిస్తే, అదే 'నమో నారాయణాయ' అనే మంత్రం అవుతుంది.

31) **పుళ్ళాయ్ ఏనముమాయ్ ★ పుగుందు ★ ఎన్నై ఉళ్ళమ్ కొండ**
**కళ్వా! ఎన్డలుమ్ ★ ఎన్ కణ్గళ్ నీర్గళ్ శోర్ తరుమాల్ ★**
**ఉళ్ళే నిన్డురుగి ★ నెంజమ్ ఉన్నై ఉళ్ళియక్కాల్ ★**
**నళ్ళేన్ ఉన్నై అల్లాల్ ★ నఱైయూర్ నిన్డ నంబియో! ॥ 7.2.1 ॥**

'తిరునఱైయూర్' అనే దివ్యదేశంలో ఉండే గుణపూర్ణుడా!, హంసగా, వరాహంగా అవతరించిన నీవు నా మనసును స్వాధీనం చేసుకున్నావు. 'నన్ను దోచుకున్న దొంగా!' అనీ నేను నిన్ను భావించినప్పుడు, నా కంటినుండి నీరు కారుతుంది. నిన్ను తలచినప్పుడు నా హృదయం ద్రవిస్తుంది. నిన్ను తప్ప ఇక దేనినీ నేను కోరను.

32) **పండేనమాయ్ ఉలగై అన్డిడంద ★ పణ్బాళా! ఎన్డు నిన్డు ★**
**తొండానేన్ తిరువడియే తుణైయల్లాల్ ★ తుణైయిలేన్ శొల్లుగిన్డేన్ ★**
**వండేందుమ్ మలర్ ప్పుఱవిల్ ★ వణ్ శేఱై ఎంబెరుమాన్ అడియార్ తమ్మై ★**
**కండేనుక్కిదు కాణీర్ ★ ఎన్ నెంజుమ్ కణ్ణిణైయుమ్ కళిక్కుం ఆఱే ॥ 7.4.6 ॥**

పూర్వం వరాహరూపంలో భూమిని ఉద్ధరించి, రక్షించిన కల్యాణగుణ సంపన్నుడా! – అని కీర్తిస్తూ నేను స్వామికి కైంకర్యం చేసేవాడను అయ్యాను. 'నీ శ్రీచరణాలే నాకు రక్ష, అవి తప్ప నాకు వేరు రక్ష ఏమీ లేదు' అని నేను గట్టిగా చెప్పగలను. తేనెటీగలు తేనెను తాగే పువ్వులు అనేకంగా వికసించే తోటలు కలిగిన 'తిరుచ్చేఱై' అనే క్షేత్రంలో నిత్య నివాసాన్నిచేసే భగవద్భక్తులను చూస్తే నా కళ్ళు, మనసు ఎంతగా సంతోషిస్తున్నాయో చూడండి.

**33) పరనే! పంజవన్ పౌழியన్ శోழన్ ★ పార్ మన్నర్ తామ్ పణిందేత్తుమ్**
**వరనే! ★ మాదవనే! మదుశూదా! ★ మఱ్ఱోర్ నల్ తుణై నిన్నలాల్ ఇలేన్ కాణ్ ★**
**నరనే! నారణనే ! తిరునఱైయూర్ నంబీ! ★ ఎంబెరుమాన్! ఉంబర్ ఆళుమ్**
**అరనే ★ ఆదివరాగమ్ మున్ ఆనాయ్! ★అழுన్దూర్ మేల్ తిశై నిన్ఱ అమ్మానే! ॥7.7.4॥**

ఓ పరాత్పరుడా!, పంచకుడు, పౌష్యుడు, చోళుడు అనే అనేక విధాల పేర్లు కల రాజులందరూ తమ శిరస్సులను వంచి నిన్ను కీర్తించేటట్లుగా వేంచేసిన గొప్పవాడా!, మాధవా!, మధుసూదనా!, నరుడవై, నారాయణుడవై అవతరించిన స్వామీ!, 'తిరునఱైయూర్' అనే క్షేత్రంలో నివసించే గుణపూర్ణా!, దేవతలను పాలించే హరీ! నీవు పూర్వం ఆదివరాహస్వామివి అయ్యావు. 'తిరువழுన్దూర్' అనే క్షేత్రంలో సాక్షాత్కరించిన స్వామీ!, నువ్వు తప్ప నాకు వేరే దగ్గరవారు ఎవరూ లేరు.

**34) శిలంబు ముదల్ కలన్ అణిందోర్ శెంగణ్ కున్ఱమ్★**
**తిగழన్దెన త్తిరువురువమ్ పన్ఱియాగి★**
**ఇలంగు పువి మడందై తనై ఇడందు పుల్గి ★**
**ఎయిఱ్ఱిడై వైత్తరుళియ ఎమ్మీశన్ కాణ్మిన్ ★**
**పులంబుశిఱై వండొలిప్ప ప్పూగమ్ తొక్క ★**
**పొழிల్ గళ్ తొఱుమ్ కుయిల్ కూవ మయిల్ గళ్ ఆల ★**

**అలంబుదిరై ప్పునల్ పుడై శూ*ழ*న్ద*ழ*గార్ శెల్వత్తు ★**

**అణియ*ழ*న్దూర్ నిన్ఱుగంద అమరర్ కోవే ॥ 7.8.4 ॥**

అందంగా ఉండే రెక్కలను కల తుమ్మెదలు ఝుంకారాలు చేస్తూ ఉండగా, పోక చెట్లు దట్టంగా పెరిగిన తోటలలో కోయిలలు రాగాలు పాడుతూ ఉండగా, నెమళ్ళు నాట్యం చేస్తూ ఉండగా, నాలుగు వైపులా జలం ఉన్నందున అందంగా ఉన్నది, సుసంపన్నమైనది అయిన తిరువ*ழ*న్దూర్ క్షేత్రంలో అమరులకు అధిపతి అయిన స్వామి వేంచేసి ఉన్నాడు. అందెలను ధరించినవాడై, ఎర్రని పెద్ద కొండవలె ఉండేవాడై, ఆభరణాలతో అలంకరింపబడినవాడై, దివ్యమంగళ రూపాన్ని కలవాడై, వరాహమూర్తిగా అవతారాన్ని ధరించి, సముద్రంలో మునిగిన భూదేవిని విడిపించి, తన కోరల అగ్రంతో పైకి ఉద్ధరించి అనుగ్రహించిన నా పాలిట దైవం 'తిరువ*ழ*న్దూర్' అనే దివ్యదేశంలో వేంచేసి ఉన్నాడు. చూడండి.

35) **మార్విల్ తిరువన్ ★ వలన్ ఏందు శక్కరత్తన్ ★**
**పారై ప్పిళంద ★ పరమన్ పరంజోది ★**
**కారిల్ తిగ*ழ* ★ కాయా వణ్ణన్ కదిర్ ముడిమేల్ ★**
**తారిల్ నఱున్తుళాయ్ ★ తా*ழ*న్దూదాయ్ కోల్ తుంబీ! ॥ 8.4.6 ॥**

తుమ్మెదా! వక్షస్సులో లక్ష్మిని కలవాడు, కుడిచేతిలో చక్రాన్ని కలవాడు, భూమిని గుచ్చి ఎత్తిన పరుడు, పరంజ్యోతి, నల్లని అతసీపుష్పం వంటి రంగును కలవాడు అయిన స్వామి కిరీటంపై చుట్టబడిన తులసీమాలికలోని పరిమళాన్ని పీల్చుకొని దానిని ఇక్కడ ఊదు.

36) **పారార్ అళవుమ్ ముదు మున్నీర్ ★ పరంద కాలమ్ ★ వళై మరుప్పిల్**
**ఏరార్ ఉరువత్తేనమాయ్ ★ ఎడుత్త ఆ*ற்ற*ల్ అమ్మానై ★**
**కూరారారల్ ఇరై కరుది ★ కురుగు పాయ క్కయల్ ఇరియుమ్ ★**
**కారార్ పుఱవిన్ కణ్ణబురత్తు ★ అడియేన్ కండు కొండేనే ॥ 8.8.3 ॥**

భూమి ప్రళయసముద్రంలో మగ్నమైన సమయంలో, గొప్ప శక్తిని కలవాడు, కోరదంతంతో అందమైన వరాహరూపాన్ని కల స్వామి, భూమిని ఉద్ధరించాడు. చేపలు చెల్లాచెదరు అయ్యేటట్లు కురిసే వానతో, మేఘాలతో ఆవరింపబడిన 'తిరుక్కణ్ణపురం'లో ఆ స్వామిని 'శౌరిరాజపెరుమాళ్' రూపంలో దర్శించాను.

37) **వెన్ఱి శేర్ తిణ్మై విలంగల్ మా మేని ★ వెళ్ళెయిత్రొళ్ళెరిత్తఱు కణ్ ★**
**పన్ఱియాయ్ అన్ఱు పార్ మగళ్ పయలై తీర్తవన్ ★ పంజవర్ పాగన్ ★**
**ఒన్ఱలా ఉరువత్తులప్పిల్ పల్ కాలత్తు ★ ఉయర్ కొడి ఒళి వళర్ మదియమ్ ★**
**శెన్ఱు శేర్ శెన్ని చ్చిగర నన్ మాడ ★ తిరుక్కణ్ణంగుడియుళ్ నిన్ఱానే ॥ 9.1.4 ॥**

శత్రువులను జయించే శక్తిని కలవాడు, పర్వతంవలె గొప్ప రూపాన్ని, తెల్లని దంతాలను, నిప్పును వెలువరించే నేత్రాలను కలిగిన వరాహమూర్తిగా అవతరించి, ప్రళయకాలంలో భూదేవిని కాపాడాడు. ఆమెకు కలిగిన బాధను పోగొట్టాడు. పంచ పాండవులలో ఒకడైన అర్జునుని రథసారథియైన ఈ సర్వలోక ప్రభువు, 'తిరుక్కణ్ణంగుడి' అనే దివ్యదేశంలో వేంచేసి ఉన్నాడు. ఈ క్షేత్రంలో ప్రకాశించే చంద్రుని తాకే రీతిలో ఎత్తయిన సౌధాలపై పలు వర్ణాలలోని ధ్వజాలు ఎగురుతూ ఉంటాయి.

38) **వాழ க్కండోమ్ ★ వందు కాణ్మిన్ తొండీర్గాళ్ ★**
**కేழల్ శెంగణ్ ★ మాముగిల్ వణ్ణర్ మరువుమ్ ఊర్ ★**
**ఏழை చ్చెంగాల్ ★ ఇన్ తుణై నారైక్కిరై తేడి ★**
**కూழை ప్పార్వై ★ కార్ వయల్ మేయుమ్ కుఱుంగుడియే ॥ 9.6.3 ॥**

భగవానునకు కైంకర్యం చేసే దాసులారా!, మనం ఉజ్జీవించే ఉపాయాన్ని తెలుసుకున్నాం. వరాహమైన ఆ పుండరీకాక్షుడు, నీలమేఘశ్యాముడు వెలసి ఉన్న క్షేత్రం 'తిరుక్కుఱుంగుడి'. ఈ క్షేత్రంలో ఓరచూపు చూసే ఆడ కొంగ, మగపక్షి కోసం ఎరను వెతుకుతూ, నల్లని చేలలో భుజిస్తూ, తిరుగుతూ ఉంటుంది.

39) **తీదఱు తింగళ్ పొంగు శుడర్ ఉంబర్ ఉంబర్ ★ ఉలగేழినోడుమ్ ఉడనే ★**
**మాదిర మణ్ శుమంద వడ కున్ఱుమ్ నిన్ఱ మలైయాఱుం ఏழு కడలుమ్ ★**
**పాదమర్ శూழ் కుళంబిన కమండలత్తిన్ ★ ఒరుపాల్ ఒడుంగ వళర్ శేర్ ★**
**ఆది మున్ ఏనమాగి అరణాయ మూర్తి అదు ★ నమ్మై ఆళుమ్ అరశే ॥ 11.4.3 ॥**

నిర్మలుడైన చంద్రుడు, వెలిగే సూర్యుడు, ఏడు లోకాలు, పది దిక్కులు, మేరు పర్వతంతో పాటు ఏడుకొండలు, ఏడు పర్వతాలు, ఏడు సముద్రాలు అనే ఇవి అన్నీ తన పాదద్వయంలో ఉండే కాలిగిట్ట లోపలి భాగంలో ఒక మూల ఒదిగి ఉండేటట్లుగా వృద్ధి చెందిన రూపాన్ని కల ఆదిమూలమే ఆదివరాహమూర్తి.

40) **కళ్ళార్ తుళాయుమ్ ★ కణవలరుమ్ కూవిళైయుమ్ ★**
**ముళ్ళార్ ముళరియుమ్ ★ ఆంబలుమ్ మున్ కండక్కాల్ ★**
**పుళ్ళాయ్ ఓర్ ఏనమాయ్ ★ పుక్కిడందాన్ పొన్నడిక్కెన్ఱు ★**
**ఉళ్ళాదార్ ఉళ్ళత్తై ★ ఉళ్ళమా క్కొళ్ళోమే ॥ 11.7.6 ॥**

తేనెను స్రవించే తులసి, కాటుక పువ్వులు, బిల్వపత్రాలు, తామరపూలు, తెల్లకలువలు అనే వీటిని చూసినప్పుడు, ఇవి అన్నీ, పూర్వం హంస రూపం ధరించినవాడు, భూమిని ఉద్ధరించిన వరాహస్వామి అందమైన పాదకమలాలకు సమర్పించవలసినవి – అని భావించని వారి మనసును, మనసు అని భావించలేము.

## తిరుక్కుఱున్దాండగమ్:

41) కేట్క యాన్ ఉ*ఱ్ఱ*దుండు ★ కే*ழ*లాయ్ ఉలగమ్ కొండ ★
పూక్కె*ழு* వణ్ణనారై ★ పోదర క్కనవిల్ కండు ★
వాక్కినాల్ కరుమమ్ తన్నాల్ ★ మనత్తినాల్ శిరత్తై తన్నాల్ ★
వేట్కై మీదూర వాంగి ★ వి*ழு*ఙ్గినేట్కినియవాఱే ॥ 4 ॥

నేను ఒక విషయాన్ని అడగాలని అనుకుంటున్నాను. పూర్వం వరాహమై లోకాన్ని కాపాడిన, పువ్వులవలె సుకుమారమైన స్వామి నా కళ్ళలో సాక్షాత్కరించాడు. మనసుతో, వాక్కుతో, శరీరంతో, ఆశగా, శ్రద్ధగా ఆ భగవానుని అనుభవాన్ని పొందాను. అది ఎంతో మధురంగా ఉన్నది. ఎవరికైనా అనుభూతిని మాటల్లో చెప్పడం సాధ్యమా? చెప్పండి.

## తిరునెడున్దాండగమ్:

42) తేరాళుమ్ వాళ్ అరక్కన్ శెల్వమ్ మాళ ★
తెన్ ఇలంగై మున్ మలంగ చ్చెందీ ఒల్గి ★
పోరాళన్ ఆయిరన్ తోళ్ వాణన్ మాళ ★
పొరు కడలై అరణ్ కడందు పుక్కు మిక్క
పారాళన్ ★ పార్ ఇడందు పారై ఉండు ★
పార్ ఉమి*ழ்*న్దు పార్ అళందు పారై ఆండ
పేరాళన్ ★ పేర్ ఓదుమ్ పెణ్ణై మణ్మేల్ ★
పెరున్ తవత్తళ్ ఎన్ఱల్లాల్ పేశలామే ॥20 ॥

శ్రీరాముడై, రథాన్ని నడుపగలవాడు, కత్తిని చక్కగా తిప్పగలిగినవాడైన రావణుని లంకను హనుమంతుని ద్వారా భస్మం చేశాడు. శ్రీకృష్ణుడై, సముద్రాన్ని దాటి, వేయి భుజాలను కల బాణాసురుని జయించాడు. ఆ స్వామియే ఈ భూమిని పాలించిన, భూమిని అండభిత్తినుండి విడదీసిన, భూమిని మింగిన, భూమిని బయటకు వెలువరించిన, భూమిని కొలిచిన పురుషోత్తముడు. ఆ స్వామి నామాలను నా కుమార్తె ఉచ్చరిస్తున్నది. ఇటువంటి నా కుమార్తెను లోకంలో గొప్ప తపస్సు కలిగినది అని మనం చెప్పవచ్చునా?

## ముదల్ తిరువన్దాది:

43) **ఎన్దు కడల్ కడైందదు ★ ఎవ్వులగమ్ నీర్ ఏ*ఱ్ఱు*దు ★**
**ఒన్దుమ్ అదనై ఉణరేన్ నాన్ ★ అన్దు**
**అడైత్తుడైత్తు ★ కణ్బడుత్త ఆ*ழி* ★ ఇదు నీ**
**పడైత్తిడందుండుమి*ழ*న్ద పార్** ॥ 2 ॥

స్వామీ! నీవు పాలసముద్రాన్ని చిలికినవిషయాన్ని కానీ, బలి చక్రవర్తి దగ్గరనుండి యాచించి, లోకాలను పొందిన విషయాన్నిగానీ నేను కొంచం కూడా తెలియను (తెలుసుకున్నవాణ్ణి కాను). శ్రీరాముడవై వారధిని కట్టి, దానిని తరువాత కూలగొట్టావు. పాలసముద్రంలో శయనించి, వరాహావతారం ఎత్తిన నీవు సృష్టించిన భూమిని నీవే మింగి, చివరకు నీవే వెలువరించావు.

44) **పొరుగోట్టోర్ ఏనమాయ్ ★ పుక్కిడందాయ్ క్కు ★ అన్దున్**
**ఒరు కోట్టిన్ మేల్ కిడందదన్దే ★ విరి తోట్ట**
**శేవడియై నీట్టి ★ దిశై నడుంగ విణ్ తుళంగ ★**
**మా వడివిల్ నీ అళంద మణ్** ॥ 9 ॥

వికసించిన తామరపూలవంటి నీ పాదాలను ప్రసరింపజేసి, దిక్కులు, పైలోకాలు భయపడేటట్లుగా పైలోకం వరకు వ్యాపించి, త్రివిక్రముడవై నీవు ప్రకాశించావు. స్వామీ!, ప్రళయసముద్రం నుండి భూమిని వరాహరూపుడవై ఉద్ధరించినపుడు, ఆ భూమి నీ కోరదంతంలో ఒకవైపు అందంగా ఇమిడి ఉన్నది.

45) **శెవి వాయ్ కణ్ మూక్కు ★ ఉడల్ ఎన్టైమ్బులనుమ్ ★ శెందీ**
**పువి కాల్ ★ నీర్ విణ్ బూదమ్ ఐందుమ్ ★ అవియాద**
**ఞానముమ్ వేళ్వియుమ్ ★ నల్లఱముమ్ ఎన్బరే★**
**ఏనమాయ్ నినాఱ్కియల్వు ॥12॥**

చెవులు, నోరు, కళ్ళు, ముక్కు, చర్మం అనే అయిదు ఇంద్రియాలు, నిప్పు, భూమి, జలం, వాయువు, ఆకాశం అనే అయిదు భూతాలు, సంపూర్ణమైన జ్ఞానం, యాగం, ధర్మం అనేవి భగవంతుని పొందడానికి సాధనాలని అంటున్నారే! కానీ, వరాహస్వామి అయిన ఆ పరమాత్మే అతనిని పొందడానికి తానే ఉపాయమై ఉన్నాడు.

46) **ఉరై మేల్ కొండు ★ ఎన్ ఉళ్ళమ్ ఓవాదు ★ ఎప్పోదుమ్**
**వరై మేల్ ★ మరగదమే పోల ★ తిరై మేల్**
**కిడందానై ★ కీండానై ★ కేழలాయ్ బూమి**
**ఇడందానై★ ఏత్తి ఎழுమ్ ॥ 25 ॥**

పర్వతంపై ఒక పచ్చ పొదిగినట్లుగా, సముద్రం కెరటాలపై భగవానుడు శయనించి ఉన్నాడు. ఆ స్వామి నరసింహావతారంలో హిరణ్యకశిపుని గుండెను చీల్చాడు. వరాహావతారంలో భూమిని ఉద్ధరించాడు. ఇటువంటి స్వామిని సదా నేను స్తుతించి తరిస్తాను.

47) ఇడందదు బూమి ★ ఎడుత్తదు కున్దమ్ ★
కడందదు కంజనై మున్ అంజ ★ కీడందదువుమ్
నీర్ ఓద మా కడలే ★ నిన్దదువుమ్ వేంగడమే ★
పేర్ ఓద వణ్ణర్ పెరిదు ॥ 39 ॥

సముద్రవర్ణం వంటి వర్ణాన్ని కలిగిన స్వామి, వరాహరూపియై భూమిని ఉద్ధరించాడు. గోవర్ధన పర్వతాన్ని గొడుగుగా చేసి ఎత్తాడు. అందరూ భయపడేటట్లు కంసుని సంహరించాడు. కెరటాలతో నిండిన సముద్రంలో శయనించాడు. వేంకటాద్రిలో నిలిచాడు.

48) పిరాన్! ఉన్ పెరుమై ★ పిఱర్ ఆర్ అఱివార్ ★
ఉరాయ్ ఉలగళంద నాన్రు ★ వరాగ –
త్తెయిఱ్ఱళవు ★ పోదా వాఱెన్ కొలో ★ ఎన్దై
అడిక్కళవు పోంద పడి ॥ 84 ॥

స్వామీ!, నీ గొప్పదనాన్ని ఎవరు తెలుసుకోగలరు? ఏ శ్రమా లేకుండా ఉండేటట్లు నీవు లోకాలను కొలిచినపుడు, నీ పాదాలకు సరిపోయేటట్లుగా భూమి అమరింది. వరాహావతారంలో నీ కోరదంతానికి చాలా చిన్నదిగా అమరింది. దీనికి అంతటికీ కారణం నీ గొప్పదనమే!

49) ఊన క్కురంబైయిన్ ★ ఉళ్ పుక్కిరుళ్ నీక్కి ★
ఞాన చ్చుడర్ కొళీ ఇ నాళ్ దోఱుమ్ ★ ఏన –
త్తురువా ఉలగిడంద ★ ఊழியాన్ పాదమ్ ★
మరువాదార్క్కుండామో వాన్ ॥ 91 ॥

భగవంతుడు, మాంసంతో నిండిన శరీరమనే ఈ గుడిసెలో ఉండే అజ్ఞానమనే చీకటిని పోగొట్టి, ఆత్మజ్ఞానమనే దీపాన్ని వెలిగించాడు. వరాహరూపుడై అవతరించి భూమిని

ఉద్ధరించినవాడు, ప్రళయకాలంలో దానిని రక్షించినవాడు అయిన ఆ భగవంతుని ఆశ్రయించనివారికి పరమపదం లభిస్తుందా?

## ఇరణ్డామ్ తిరువన్దాది:

**50) నీ అన్ఱులగళందాయ్ ★ నీండ తిరుమాలే ★**
**నీ అన్ఱులగిడందాయ్ ఎన్బరాల్ ★ నీ అన్ఱు**
**కార్ ఓదమ్ మున్ కడైందు ★ పిన్ అడైత్తాయ్ మా కడలై ★**
**పేర్ ఓద మేని ప్పిరాన్ ॥ 30 ॥**

స్వామీ!, పూర్వం నీవు లోకాలను అన్నిటినీ కొలిచావు. భూమిని ఉద్ధరించావు. సముద్రాన్ని చిలికావు. దానికి వారధి కట్టావు. సముద్రవర్ణం కల ఓ స్వామీ!, నీ ఆశ్చర్యకరమైన లీలలను మహర్షులు వర్ణిస్తారు. ఆ లీలలన్నీ మాకు విస్మయాన్ని కలిగిస్తాయి.

**51) పిరాన్ ఎన్ఱు నాళుమ్ ★ పెరుమ్ పులరి ఎన్ఱుమ్ ★**
**కురా నఱ్చెழుమ్ పోదు కొండు ★ వరాహ –**
**త్తణి ఉరువన్ ★ పాదమ్ పణియుమ్ అవర్ కండీర్ ★**
**మణి ఉరువమ్ కాణ్బార్ మగిழ்న్దు ॥31॥**

'స్వామీ!, నేడు సుప్రభాతం' అని అంటూ వరాహమూర్తిగా అందంగా అవతరించిన స్వామి పాదాలను ప్రతిదినం సువాసన కలిగిన అందమైన 'కురా' అనే పూలతో ఆరాధించే భక్తులు, ఆ స్వామి అందమైన రూపాన్ని ఆనందంగా దర్శించగలరు.

**52) మాలై అరి ఉరువన్ ★ పాదమలర్ అణిందు ★**
**కాలై తొழுదెழுమిన్ కైగోలి ★ ఞాలమ్**

**అళందిడందుండుమిழ்న్దు ★ అణ్ణలై మఱ్ఱల్లాల్ ★**

**ఉళమ్ కిడంద ఆట్రాల్ ఉణర్ న్దు ॥ 47 ॥**

సంధ్యాకాలంలో నరసింహ రూపాన్ని ధరించాడు. త్రివిక్రమ రూపాన్ని ఎత్తి, భూమిని కొలిచాడు. వరాహమూర్తియై దానిని ఉద్ధరించాడు. ప్రళయకాలంలో జగత్తును అంతటినీ ఆరగించి తరువాత దానిని సృష్టి సమయంలో వెలువరించాడు. అటువంటి ఆ స్వామి పాదాలకు ఉదయకాలంలో పూలమాలికలను సమర్పించి, చేతులను జోడించి, నమస్కరించి, తరించండి.

## మూన్ఱామ్ తిరువన్దాది:

53) **పురిందు మద వేழ்మ్ ★ మా ప్పిడియోడూడి ★**
**తిరిందు శినత్తాల్ పొరుదు ★ విరింద శీర్**
**వెణ్ కోట్టు ★ ముత్తుదిర్కుమ్ వేంగడమే ★ మేల్ ఒరునాళ్**
**మణ్ కోట్టు క్కొండాన్ మలై ॥ 45 ॥**

వేంకటాచలంపై పెద్ద ఆడఏనుగుతో సంచరిస్తూ, మగఏనుగు దానితో ప్రళయకలహం ఆడి, దూరంగా వెళ్ళిపోయింది. తరువాత, మళ్ళీ దాని విరహాన్ని సహించలేక, బాధతో, తన దంతంతో నేలపై మోదింది. అపుడు ఆ దంతం నుండి తెల్లని ముత్యాలు రాలుతున్నాయి. ఇటువంటి రీతిలో ప్రకృతి సౌందర్యాన్ని కలిగిన ఈ వేంకటాద్రి, పూర్వం భూమిని ఉద్ధరించిన వరాహస్వామి వెలసిన పర్వతం.

54) **తాళాల్ శగడమ్ ★ ఉద్దైత్తు ప్పగడుంది ★**
**కీళా మరుదిడై పోయ్ క్కేழలాయ్ ★ మీళాదు**
**మణ్ అగలమ్ కీండు ★ అంగోర్ మాదుగంద మార్వఱ్కు ★**

**పెణ్ అగలమ్ కాదల్ పెరిదు ॥ 54 ॥**

శకటాసురుని తన పాదంతో తన్ని, 'కువలయాపీడం ' అనే మదపుటేనుగు దంతాన్ని ఊడబీకి, మద్దిచెట్ల మధ్యకు దోగాడుతూ పోయి, వరాహమై విశాలమైన ఈ భూమిని ఉద్ధరించి, ఈ విధంగా గొప్ప కార్యాలని చేసినవాడు, సాటిలేని లక్ష్మీ దేవిని వక్షఃస్థలలో కలిగిన స్వామికి భూదేవి పట్ల ఉండే ప్రేమ చాలా గొప్పది.

## నాన్ముగన్ తిరువన్దాది:

55) **తాన్ ఒరువన్ ఆగి ★ తరణి ఇడందెడుత్తు ★**
**ఏన్ ఒరువనాయ్ ఎయిఱ్ఱిల్ తాంగియదుమ్ ★ యాన్ ఒరువన్ ★**
**ఇన్ఱా అఱిగిన్ఱేన్ అల్లేన్ ★ ఇరు నిలత్తై**
**చ్చెన్ఱాంగడిప్పడుత్త శేయ్ ॥ 70 ॥**

సాటిలేనివాడైన భగవంతుడు, విశాలమైన భూమిని బలిచక్రవర్తి దగ్గరకు వెళ్ళి, యాచించి పొంది, దానిని కొలిచాడు. అతడే వరాహమూర్తిగా అవతరించి, భూమిని ఉద్ధరించి తన కోరదంతంతో ధరించాడు. ఈ లీలలను అన్నిటినీ నేనొక్కడనే కాదు, ఎందరో, ఎంతోకాలంగా గ్రహించారు.

## తిరువిరుత్తమ్

56) **పెరుంగేழలార్ తమ్ ★ పెరుంగణ్ మలర్ ప్పుండరీగమ్ ★ నమ్మేల్**
**ఒరుంగే పిఱழ వైత్తార్ ఇవ్వ కాలమ్ ★ ఒరువర్ నమ్ పోల్**

**వరుంగేఘ్ఘబవర్ ఉళరే తొల్లై వాఘ్ఘియమ్ శూఘ్ఘ పిఱప్పు ★**
**మరుంగే వర ప్పెఱుమే ★ శొల్లు వాఘ్ఘి మడ నెంజమే! ॥ 45 ॥**

జ్ఞానం లేని ఓ మనసా!, వరాహస్వామి తామరపూలవంటి తన నేత్రాలతో మనలను కటాక్షించాడు. ఈ కాలంలో మనలను ఎవరైనా తమ చూపులతో ఈ విధంగా చూచారా? ఈ విధంగా భగవంతునిచే కటాక్షింపబడినవారు ఎవరైనా ఉన్నారా? ఎవరికీ కలగని అదృష్టం మనకు లభించింది. ఇక మనకు మరుజన్మ ఉంటుందా చెప్పు? ఇకనైనా సుఖంగా ఉండు.

57) **వండుగళో! వమ్మిన్ ★ నీర్ ప్పూ నిల ప్పూ మరత్తిల్ ఒణ్ పూ ★**
**ఉండు కళిత్తుఘ్ఘల్ వీర్కొన్నురైక్కియమ్ ★ ఏనం ఒన్నాయ్**
**మణ్ తుగళ్ ఆడి వైగుందమ్ అన్నాళ్ కుఘ్ఘల్ వాయ్ విరై పోల్ ★**
**విండుగళ్ వారుమ్ ★ మలర్ ఉళవో నుమ్ వియలిడత్తే ॥ 55 ॥**

తుమ్మెదలారా!, రండి. నీటిలోని పూలు, నేలపై పూలు, చెట్లపై పూలు అనే ఈ పూలలో ఉండే తేనెను ఆస్వాదించే మిమ్ములను ఒక ప్రశ్న అడుగుతాను. నా పరాంకుశనాయకి యొక్క కేశాలు, వరాహమై భూమిని ఉద్ధరించినపుడు ఈ భూమియొక్క ధూళి అంటుకొన్న ఆ స్వామి యొక్క పరమపదంతో సమానమైన రీతిలో అందమైనవి, గొప్పవి. ఈ కురుల పరిమళంవలె మీరు సంచరించే ప్రదేశాలలో పూలు పరిమళిస్తాయా? చెప్పండి.

58) **ఈన చ్చొల్లాయినుమ్ ఆగ ★ ఎఱి తిరై వైయమ్ ముట్రుమ్ ★**
**ఏనత్తురువాయ్ ఇడంద పిరాన్ ★ ఇరుమ్ కఱ్పగమ్ శేర్**
**వానత్తవర్కుమ్ అల్లాదవర్కుమ్ మట్రెల్లాయవర్కుమ్ ★**
**ఞాన ప్పిరానై అల్లాల్ ఇల్లె ★ నాన్ కండ నల్లదువే ॥ 99 ॥**

నేను చెప్పే ఈ మాట హీనమైనదే కావచ్చు. కెరటాలతో కూడిన సముద్రాన్ని చుట్టూ కలిగిన భూమిని, వరాహరూపుడై ఉద్ధరించిన స్వామి గొప్ప కల్పవృక్షం వంటివాడు. అతడు నిత్యసూరులకు (దేవతలకు), ఇంకా మిగిలిన వారికి, మనుష్యులు మొదలైన వారికి కూడా రక్షకుడు. జ్ఞానజ్యోతి స్వరూపుడైన ఆ స్వామిని తప్ప నేనెవరిని ఆరాధించగలను? ఇదే నేను తెలిసికొన్న హితం.

## తిరువాశిరియమ్

**59) ఓఓ! ఉలగినదియల్వే ★ ఈన్తోళ్ ఇరుక్క**
**మణై నీరాట్టి ★ పడైత్తిడందుండుమిழ்న్దు–**
**అళందు ★ తేర్ న్దులగళిక్కుమ్ ముదల్ పెరుమ్**
**కడవుళ్ నిఱ్ప ★ పుడై ప్పల తాన్ అఱి**
**తెయ్ వమ్ పేణుదల్ ★ తనాదు**
**పుల్లఱి వాణ్మై పొరుంద క్కాట్టి★**
**కొల్వన ముదలా అల్లన ముయలుమ్ ★**
**ఇనైయ శెయ్ గై ఇన్బు తున్బళి ★**
**తొల్ మా మాయ ప్పిఱవియుళ్ నీంగా ★**
**పల్మా మాయత్తழ்న్దుమా నళిర్ న్దే ॥ 6 ॥**

లోకాలను సృష్టించి, వరాహమూర్తియై ఉద్ధరించి, ప్రళయకాలంలో పొట్టలో పెట్టుకొని, తరువాత బయటకు వెలువరించి, త్రివిక్రముడై భూమిని కొలిచి, ఈ విధంగా అనేక విధాలుగా రక్షణ మార్గాలను ఆలోచిస్తూ, అన్ని విధాలుగా కాపాడే ఆ దైవం అయిన శ్రీమన్నారాయణుడు ఉండగా, అతనిని ఆశ్రయించకుండా వదిలిపెట్టి, ఏదో ఒక మూలలో చెప్పబడిన, వారు వారు నిర్ణయించుకోబడిన, అనేక విధాలుగా ఉన్న దేవతలను ఆరాధించడం ఎటువంటివి? – అంటే,

తన నీచమైన బుద్ధిని వ్యక్తం చేసుకొని, కన్న తల్లికి సేవ చేయకుండా, ఒక పీటకు స్నానం చేయించడంవంటిది. బలి ఇవ్వడం మొదలైన అకార్యాలను చేయడం మొదలైన ప్రయత్నాలు లోకులు చేస్తున్నారు. ఆ అన్య దేవతలు చేసే అనుగ్రహం కూడా సుఖం అనే పేరు గల దుఃఖాన్నే కలిగిస్తుంది. ఎందుకంటే, అనాది, పెద్దది, ఆశ్చర్యకరమైనది అయిన ఈ సంసారం నుండి విముక్తి లేక, అనేక విధాలైన మోహన్ని కలిగించే సాంసారిక విషయాలలో లోతుగా మునిగిపోవడం సంభవిస్తుంది. అయ్యో! ఏమి లోక స్వభావం ఇది!

## పెరియ తిరువన్దాది

60) **యామే అరువినైయోమ్ శేయోమ్ ★ ఎన్ నెంజినార్**
**తామే ★ అణుక్కరాయ్ చ్చార్ న్దొళిన్దార్ ★ పూ మేయ**
**శెమ్మాదై ★ నిన్ మార్విల్ శేర్విత్తు ★ పార్ ఇడంద**
**అమ్మా! నిన్ పాదత్తరుగు ॥ 7 ॥**

తామర పువులో నివసించే, బంగారు రంగును కల లక్ష్మీదేవిని నీ వక్షస్థలంపై చేర్చుకున్నవాడవు, భూమిని ఉద్ధరించినవాడవు అయిన ఓ స్వామీ!, నీపాదాల సమీపానికి నా మనస్సు స్వయంగా చేరిపోయింది. పోగొట్టడానికి సాధ్యంకాని పాపాలను చేసిన నేను మాత్రం దూరంగా ఉన్నాను.

61) **శీరాల్ పిఱందు★ శిఱప్పాల్ వళరాదు ★**
**పేర్ వామన్ ఆగాక్కాల్ పేరాళా ★ మార్బార**
**ప్పుల్గి నీ ఉండుమిళ్ న్ద ★ పూమి నీర్ ఏఱ్పరిదే ★**
**శొల్లు నీ యామ్ అఱియ చ్చూళ్ న్దు॥ 16 ॥**

మహానుభావా!, గొప్పగా పుట్టకుండా, గొప్పగా పెరగకుండా, పేరు వామనుడని పెట్టుకోకపోతే, నీవు పూర్వం వరాహరూపాన్ని ఎత్తి, నీ వక్షఃస్థలానికి అదుముకొని కౌగలించుకొని రక్షించినది, ఒక సమయంలో నీకడుపులో పెట్టుకొని కాపాడినది, ఆ తరువాత బయటకు వెలువరించినది అయిన ఈ భూమిని దాన, జలధారాపూర్వకంగా పొందడం సాధ్యం కాదా ఏమి? మేము అర్థం చేసుకునేటట్లు వివరించి చెప్పు.

62) **పార్ ఉండాన్ పార్ ఉమిౖ*ழ్*న్దాన్ ★ పార్ ఇడందాన్ పార్ అళందాన్ ★**
**పార్ ఇడమ్ మున్ పడైత్తాన్ ఎన్బరాల్ ★ పార్ ఇడమ్**
**ఆవానుమ్ ★ తాన్ ఆనాల్ ఆర్ ఇడమే ★ మట్రొరువర్ –**
**క్కావాన్ పుగావాల్ అవై ॥ 42 ॥**

ప్రళయకాలంలో భూమిని మింగినవాడు, ఆ తరువాత దానిని బయటకు వెలువరించినవాడు, వరాహరూపాన్ని ధరించి, ఆ భూమిని తన దంతంతో ధరించినవాడు, మొట్టమొదట భూమిని సృష్టించినవాడు శ్రీమన్నారాయణుడే అని జ్ఞానులు అంటారు. విశ్వరూపుడు అతడే అయినప్పుడు, మనకు ఆశ్రయించదగినవారు ఇక అన్యులు ఎవరున్నారు? లోకాలు ఆ స్వామికే తప్ప ఇంకెవరికీ చెందినవి కావు.

**<u>తిరువె*ழు*కూ*ற్ற్*రిరుక్కై:</u>**

63) **ఏ*ழు*లకు ఎయి*ற్ற్*నిల్ కొణ్డనై**

ఏడులోకాలను దంతంచివర గ్రహించినవాడు

## పెరియ తిరుమడల్:

**64) పిన్ను మోరేనమాయ్ పుక్కువళైమరుప్పిల్ కొల్ నవిలుమ్ కూర్ నుదిమేల్ ★ వైత్తు ఎడుత్త కూత్తనై**

సకల జీవరాసులు నివసించే ఈ విశాలమైన భూమిని మహాప్రళయం తన లోపలకు గ్రహించగా, వరాహమై సముద్రంలో ప్రవేశించి, వంపుతిరిగిన కోరలతో ఆ జగత్తును ఉద్ధరించి, పైకి తెచ్చిన గొప్పకార్యాన్ని సాధించినవానిని.

## తిరువాయ్ మొழி:

**65) పిరాన్ ★ పెరు నిలమ్ కీండవన్ ★ పిన్నుమ్**
**విరాయ్ మలర్ త్తుళాయ్ ★ వేయ్ంద ముడియన్ ★**
**మరామరమ్ ★ ఎయ్ ద మాయవన్ ★ ఎన్నుళ్**
**ఇరాన్ ఎనిల్ ★ పిన్నై యాన్ ఒట్టువేనో ॥ 1.7.6 ॥**

అందంగా కూర్చబడిన తులసిమాలతో అలంకరింపబడ్డ దివ్యవిగ్రహ సౌందర్యాన్ని కలవాడు, వరాహరూపాన్ని ధరించి భూమిని ఎత్తినవాడు, ఆశ్రితులను రక్షించేవాడు, ఏడు సాల వృక్షాలను పడగొట్టినవాడు, ఆశ్చర్యకరుడు అయిన స్వామి నాకు ప్రత్యక్షమై, నన్ను వశపరచుకొని, తరువాత నన్ను వదిలిపోతాను అంటే ఏవిధంగా అంగీకరిస్తాను?

**66) ఆనాన్ ఆన్ ఆయన్ ★ మీనోడేనముమ్ ★**
**తాన్ ఆనాన్ ఎన్నిల్ ★ తాన్ ఆయ శంగే ॥ 1.8.8 ॥**

నా సంతోషం కోసం గోపాలుడై అవతరించాడు. మత్స్యంగా, వరాహంగా అవతరించాడు. ఆ స్వామి ఎత్తిన అవతారాలు ఇన్ని అని లెక్కించగలమా?

67) శూ*ళ్గ*ల్ పల పల వల్లాన్ ★ తొల్లెయంగాలత్తులగై ★
కే*ళ్గ*ల్ ఒన్డాగి ఇడంద ★ కేశవన్ ఎన్నుడై అమ్మాన్ ★
వే*ళ్గ* మరుప్పై ఒశిత్తాన్ ★ విణ్ణవర్కెణ్ణల్ అరియాన్ ★
ఆ*ళ్గ* నెడుంగడల్ శేర్ న్దాన్ ★ అవన్ ఎన్ అరుగల్ ఇలానే ॥ 1.9.2 ॥

స్వామి, పూర్వకాలంలో వరాహరూపాన్ని ఎత్తి, లోకాన్ని ఉద్ధరించాడు. అతడే సాటి లేని ఆదివరాహమూర్తి, కేశవుడు. కువలయాపీడం అనే మదించిన ఏనుగు దంతాన్ని విరిచి, వధించి, ఎన్నో ఆశ్చర్యకరమైన లీలలను చేశాడు. లోతైన పాల సముద్రంలో ఆదిశేషుడనే పడకపై పరుండిన దైవం, నాలో వెలుగుతున్నాడు.

68) ఇనియార్ ఞానంగళాల్ ★ ఎడుక్కల్ ఎళాద ఎందాయ్ ★
కనివార్ వీట్టిన్బమే ★ ఎన్ కడల్ పడా అముదే ★
తనియేన్ వా*ళ్గ* ముదలే ★ పొ*ళ్గి*ల్ ఏ*ళ్గు*మ్ ఏనమ్ ఒన్డాయ్ ★
నునియార్ కోట్టిల్ వైత్తాయ్ ★ ఉన పాదమ్ శేర్ న్దేనే ॥ 2.3.5 ॥

ఎటువంటివారైనా తమ జ్ఞానవిశేషంతో తెలుసుకోవడానికి ప్రయత్నం చేస్తే, గ్రహించడానికి వీలు కాని నా స్వామీ!, నీ పట్ల భక్తి కలిగినవారికి మూర్తీభవించిన మోక్షానందమైనవాడా!, ఉప్పు సముద్రంలో లభించని, నాకు భోగ్యమైన ఓ అమృతమా!, అద్వితీయ భక్తుడను అయిన నా జీవితానికి మొదటి కారణమైనవాడా!, ఏడు లోకాలను సాటిలేని వరాహమూర్తివై, నీ పదునైన కోరదంతం చివరలో ధరించినవాడా!, ఇక నేను నీ చరణాలను ఆశ్రయించాను.

69) కిడందిరుందు నిన్డళందు ★ కే*ళ్గ*లాయ్ కీ*ళ్గ* పు–
క్కిడందిడుమ్ ★ తన్నుళ్ కరక్కుమ్ ఉమి*ళ్గు*మ్ ★

**తడమ్ పెరుమ్ తోళ్ ఆర త్తழువుమ్ ★ పార్ ఎన్నుమ్**

**మడందైయై ★ మాల్ శెయ్ గిన్ఱ మాల్, ఆర్ కాణ్బారే ॥ 2.8.7 ॥**

సముద్రతీరంలో శయనించి, చిత్రకూటగిరిలో వేంచేసి ఉండి, రావణుని సంహరించిన తర్వాత విజయలక్ష్మితో లంక ద్వారం దగ్గర నిలిచి ఉండి, త్రివిక్రమావతారాన్ని ఎత్తి, భూమిని కొలిచి, వరాహరూపాన్ని ధరించి, సముద్రం లోపలికి పోయి, అండ కటాహం నుండి భూమిని ఉద్ధరించి, ఈ విధంగా ఇటువంటి కార్యాలను చేసే భగవంతుడు తనలో ముల్లోకాలను ప్రళయకాలంలో దాచి ఉంచుతాడు. ఆ సమయం తీరగానే బయటకు వ్యక్తం చేస్తాడు. ఈ విధంగా భూమి విషయంలో అతడు పొందే వ్యామోహాన్ని ఎవరు అర్థం చేసుకోగలరు?

70) **నలమ్ ఎన నినైమిన్ ★ నరగ ழున్దాదే ★**
**నిల మునమ్ ఇడందాన్ ★ నీడుఱై కోయిల్ ★**
**మలమ్ అఱుమది శేర్ ★ మాలిరుంజోలై ★**
**వల ముఱై ఎయ్ దు ★ మరువుదల్ వలమే ॥ 2.10.7 ॥**

నరకంలో పడకూడదని భావించి, ఈ ఉపదేశమే మంచిది అని భావించండి. అది ఏమంటే, పూర్వం వరాహమూర్తియై భూమిని ఉద్ధరించిన స్వామి నిత్యం నివాసం చేసే చోటు, నిర్మలమైన చంద్రుడు అందే చోటు అయిన వనగిరిని అనుకూలమైన దారిలో చేరి, అక్కడ ఉండడమే.

71) **మఱైయాయ నాల్ వేదత్తుళ్ నిన్ఱ ★ మలర్ చ్చుడరే ★**
**ముఱైయాల్ ఇవ్వులగెల్లామ్ ★ పడైత్తిడందుండుమిழ్న్దళందాయ్ ★**
**పిఱైయేఱు శడైయానుమ్ ★ నాన్ముగనుమ్ ఇందిరనుమ్ ★**
**ఇఱై ఆదల్ అఱిందేత్త ★ వీற்றிరుత్తల్ ఇదు వియప్పే ॥ 3.1.10 ॥**

రహస్యమైన అర్ధాలను కల నాలుగు వేదాలలో అంతరార్ధంగా వేంచేసి ఉండే, వికసించే తేజ స్వరూపాలను కల దేవా! క్రమానుసారంగా ఈ లోకాలను అన్నిటిని సృష్టించి, ప్రళయ కాలంలో ప్రళయజలంనుండి వరాహమై ఉద్ధరించి, నీ కడుపులో పెట్టుకొని కాపాడి, తరువాత బయటకు పెట్టి, వామనావతారం ఎత్తినప్పుడు కొలిచిన స్వామీ!, జటలలో చంద్రుని ధరించిన శివుడు, నాలుగు ముఖాలు గల బ్రహ్మ, దేవేంద్రుడు నీ ఈశ్వరత్వాన్ని తెలిసికొని, కీర్తించేటట్లుగా నీవు వేంచేసి ఉండే ఈ స్థితి ఆశ్చర్యకరమా?

72) **మాదర్ మా మణ్మడంద్దై పొరుట్టు ★ ఏనమ్ ఆయ్ ★**
**ఆదియంగాలత్తు ★ అగల్ ఇడమ్ కీండవర్ ★**
**పాదంగళ్ మేల్ అణి ★ పైమ్ పొన్ తుళాయ్ ఎన్ఱ్లే**
**ఓదుమాల్ ★ ఎయ్ దనళ్ ★ ఎందన్ మడంద్దైయే ॥ 4.2.6 ॥**

'గొప్ప అందాన్ని కల భూదేవికోసం పూర్వకాలంలో వరాహమూర్తియై, విశాలమైన భూమండలాన్ని పెకలించి తెచ్చిన దేవుని శ్రీచరణాలలో సమర్పించిన, అతి సుందరమైన తులసి ఇది!' అని పలుసార్లు పలవరించే వ్యామోహాన్ని నా కుమార్తె పొందింది.

73) **ఉండుమ్ ఉమిఝ్ న్దుమ్ కడందుమ్ ఇడందుమ్ ★ కిడందుమ్ నిన్ఱుమ్ ★**
**కొండ కోలత్తొడు వీ*ఱ్ఱ్*రుందుమ్ ★ మణమ్ కూడియుమ్ ★**
**కండ ఆట్రాల్ ★ తనదే ఉలగెన నిన్ఱాన్ తన్నై ★**
**వణ్ తమిఝ్ నూఱ్కు నోట్రేన్ ★ అడియార్కిన్న మారియే ॥ 4.5.10 ॥**

ప్రళయకాలంలో పొట్టలో పెట్టుకొని, ఆ తరువాత బయటకు వెలువరించి, త్రివిక్రమావతారంలో కొలిచి, వరాహావతారంలో దంతంతో గుచ్చి ఎత్తి, శ్రీరామావతారంలో సముద్రతీరంలో శయనించి, రావణ వధ చేసి, దేవతల ఎదుట నిలిచి, పట్టాభిషేకానికి తగిన

అలంకారంతో పాటు సింహాసనంలో వేంచేసి ఉండి, పదకొండు వేల సంవత్సరాలు రాజ్యాన్ని ఏలి, ఈ విధంగా ప్రత్యక్షంగా కనిపించే లీలలతో 'ఈ లోకం అంతా నా సొత్తే!' అనే విధంగా వేంచేసి ఉండే భగవంతునిగూర్చి సుందరమైన ద్రావిడ ప్రబంధాన్ని రచించే అదృష్టాన్ని పొందాను. ఈ ప్రబంధం భగవద్భక్తులకు ఆనందాన్ని వర్షించే మేఘంవలె ఉన్నది.

**74) పరంద తెయ్ వముమ్ పల్లులగుమ్ పడైత్తు ★ అన్ఱుడనే విழுజ్గి ★**
**కరందుమిழுన్దు కడందిడందదు ★ కండుమ్ తెళియగిల్లీర్ ★**
**శిరంగళాల్ అమరర్ వణంగుమ్ ★ తిరుక్కురుగూర్ అదనుళ్ ★**
**పరన్ తిఱమ్ అన్ఱి ప్పల్లులగీర్! ★ తెయ్ వమ్ మற்றில్లై పేశుమినే ॥ 4.10.3 ॥**

విస్తరించిన దేవవర్గాలను, లోకాలను సృష్టించి, వాటిని అన్నిటిని బొజ్జలో పెట్టుకొని దాచి, ప్రళయం తీరిపోగానే వెలువరించి, దానిని వామనావతారంలో బలి వద్ద దానంగా పొంది కొలిచి, వరాహమూర్తియై దంతంతో గుచ్చి ఎత్తి – ఈ విధంగా భగవంతుడు చేసిన కార్యాలన్నీ ప్రమాణాలను బట్టి తెలిసికోలేకుండా ఉన్నారే! పలులోకాలలో ఉండే జనులారా!, దేవతలు శిరస్సుతో నమస్కరించే శ్రీకురుకాపురిలో వేంచేసి ఉన్న పరమపురుషుని కంటే ఇంకొక గొప్ప దైవం ఉంటే చెప్పండి.

**75) కడల్ ఞాలమ్ శెయ్ దేనుమ్ యానే ఎన్నుమ్ ★**
**కడల్ ఞాలమ్ ఆవేనుమ్ యానే ఎన్నుమ్ ★**
**కడల్ ఞాలమ్ కొండేనుమ్ యానే ఎన్నుమ్ ★**
**కడల్ ఞాలమ్ కీండేనుమ్ యానే ఎన్నుమ్ ★**
**కడల్ ఞాలమ్ ఉండేనుమ్ యానే ఎన్నుమ్ ★**
**కడల్ ఞాలత్తీశన్ వందేఱ క్కొలో ★**

**కడల్ ఞాలత్తీర్కివై ఎన్ శొల్లుగేన్ ★**

**కడల్ ఞాలత్తెన్ మగళ్ కత్కిన్టవే ॥ 5.6.1 ॥**

సముద్రాన్ని చుట్టూ కలిగిన ఈ భూమండలంలో ఉండే నా కుమార్తె, సముద్రం చేత పరివేష్ఠితమైన ఈ భూమిని సృష్టించినదానను నేనే అంటున్నది. సముద్ర పరివేష్ఠితమైన జగత్తులో అనుప్రవేశించినదానను నేనే అంటున్నది. సముద్ర పరివేష్ఠితమైన ఈ జగత్తును బలి దగ్గర దానంగా పొందినది నేనే అంటున్నది. సముద్రపరివేష్ఠితమైన భూమిని వరాహమై ఎత్తిన దానను నేనే అంటున్నది. సముద్రపరివేష్ఠితమైన భూమిని ప్రళయకాలంలో పొట్టలో పెట్టుకున్నది నేనే అంటున్నది. ఈమె పలికే ఈ మాటలు సముద్రపరివేష్ఠితమైన ఈ భూమికి అధిపతి అయిన స్వామి ఈమెలో ఆవేశించడం వలననా! సముద్రపరివేష్ఠితమైన ఈ భూమిలో ఉండే మీకు ఏమని చెప్పను?

76) **మాఱు శేర్ పడై నూత్రువర్ మంగ ★ ఓర్ ఐవర్ క్కాయన్టు మాయప్పోర్ పణ్ణి ★**

**నీఱు శెయ్ ద ఎందాయ్! ★ నిలంగీండ అమ్మానే ★**

**తేఱు ఞానత్తర్ వేద వేళ్వియఱా ★ శిరీవర మంగలనగర్ ★**

**ఏఱివీ*ర్ర్*రుందాయ్! ★ ఉన్నై ఎంగెయ్ ద క్కూవువనే ॥ 5.7.4 ॥**

విరోధులై, సేనతో కూడినవారు అయిన దుర్యోధనుడు మొదలైన నూరుమంది నశించేటట్లు ఆ కాలంలో పంచపాండవుల పక్షాన ఉన్నవాడవై, ఆశ్చర్యకరమైన యుద్ధాన్ని నడిపి, కౌరవులను ధ్వంసం చేసిన స్వామీ!, ప్రళయజలం నుండి భూమిని దంతంతో గుచ్చి ఎత్తిన దేవా!, స్వచ్ఛమైన జ్ఞానాన్ని కలిగిన శ్రీవైష్ణవులు చేసే సమారాధన నిరంతరాయంగా జరిగే చోటు అయిన 'వానమామలై' క్షేత్రంలో గొప్పగా వేంచేసి ఉన్నవాడవైన నిన్ను, ఎక్కడ పొందగలనో ఏమని చెప్పను?

77) ఏనమాయ్ నిలమ్ కీండ ఎన్నప్పనే! కణ్ణా! ★ ఎన్రుమ్ ఎన్నై ఆళుడై ★
వాన నాయగనే! ★ మణి మాణిక్క చ్చుడరే ★
తేనమాం పొழிల్ తణ్ శిరీవర మంగలత్తవర్ ★ కై తొழுవుఱై ★
వాన మామలైయే! ★ అడియేన్ తొழு వందరుళే ॥ 5.7.6 ॥

మహా వరాహమై భూమిని గుచ్చి, ఎత్తి స్వస్థానంలో నిలిపిన నా తండ్రీ!, కృష్ణా!, ఎల్లప్పుడూ నన్ను దాసునిగా పాలించే, మాణిక్యంవంటి తేజస్సును కలవాడా!, తేనె నిండుగా ఉండే మామిడి తోటల నడుమ ఉన్నది, చల్లనిది అయిన 'వానమామలై' క్షేత్రంలో నివసించేవారు ఆరాధించేటట్లుగా, అక్కడ ఎల్లప్పుడూ ఉండే వానమామలై స్వామీ!, నేను నమస్కరించేటట్లు నీవు వేంచేయాలి.

78) ఉణ్ణ వానవర్ కోనుక్కు ★ ఆయర్ ఒరుప్పడుత్త అడిశిల్ ఉండదుమ్ ★
వణ్ణ మాల్ వరైయై ఎడుత్తు ★ మழை కాత్తదుమ్ ★
మణ్ణై మున్ పడైత్తుండుమిழ்న్దు ★ కడందిడందు మణంద మాయంగళ్ ★
ఎణ్ణుం దోఱుమ్ ఎన్ నెంజు ★ఎరివాయ్ మెழுగొక్కు నిన్రే ॥ 5.10.5 ॥

దేవతలకు అధిపతి అయిన ఇంద్రుని ఆరాధన కోసం గొల్లలు సిద్ధం చేసిన పదార్థాలన్నిటినీ తానే ఆరగించడం, చక్కని గోవర్ధన పర్వతాన్ని గొడుగుగా ఎత్తి, వర్షాన్ని అడ్డగించడం, భూమిని సృష్టి ఆరంభంలో సృష్టించి, తరువాత ప్రళయకాలంలో పొట్టలో పెట్టుకొని, ప్రళయం తీరిపోగానే వెలువరించి, కొలిచి, వరాహావతారం ఎత్తి ఉద్ధరించి, దానిని పరిణయమాడడం – అని ఈ విధంగా స్వామి చేసిన అనేక ఆశ్చర్యకరమైన చేష్టలను ఆలోచించగా, ఆలోచించగా, నా మనసు ఎల్లప్పుడూ నిప్పు దగ్గర ఉండే మైనం వలె కరిగిపోతున్నది.

79) పణ్బుడై వేదమ్ ★ పయంద పరనుక్కు ★
మణ్ పురై వైయమ్ ★ ఇడంద వరాగఱ్కు ★

**తెణ్ పునల్ పళ్ళి ★ ఎం తేవ పిరానుక్కు ★ ఎన్**
**కణ్బునై కోద్దై ★ ఇழన్దదు కట్పే ॥ 6.6.5 ॥**

భగవంతుని ఈశ్వరత్వాన్ని తెలియజేసే స్వభావాన్ని కల వేదాన్ని బ్రహ్మకు ఉపదేశించిన సర్వేశ్వరుడు, మట్టితో నిండిన భూదేవిని ఉద్ధరించిన వరాహమూర్తి, స్వచ్ఛమైన నీరు అయిన ఏకార్ణవంలో పరుండినవాడు అయిన దేవాదిదేవుని విషయంలో ఉండే ఆసక్తిచేత, అందంగా ఉండే కేశపాశాన్ని కల నా పుత్రిక తన జ్ఞానాన్ని పోగొట్టుకున్నది.

80) **వేదియానిఱ్ఱుమ్ ఐవరాల్ ★ వినైయేనై మోదువిత్తు ★ ఉన్ తిరువడి**
**చ్చాదియావగై ★ నీ తడుత్తెన్ పెఱుదియందో ★**
**ఆదియాగి అగల్ ఇడమ్ పడైత్తు ★ ఉండుమిழన్దు కడందిడందిట్ట ★**
**శోది నీళ్ ముడియాయ్! ★ తొండనేన్ మదుశూదననే! ॥ 7.1.3 ॥**

కారణభూతుడవై, విశాలమైన జగత్తును సృష్టించి, ప్రళయకాలంలో దానిని ఉదరంలో పెట్టుకొని రక్షించి, తరువాత బయటకు తెచ్చి, వరాహావతారం ఎత్తి, దానిని ఉద్ధరించినవాడవు, గొప్పగా వెలిగే ఎత్తయిన కిరీటాన్ని కలవాడా!, నన్ను దాసునిగా చేసి కొన్న మధుసూదనా!, పాపిష్ఠివాడను అయిన నన్ను ఎల్లప్పుడూ పీడించే పంచేంద్రియాలతో హింసించి, నీ చరణ సన్నిధిని చేరనీయకుండా అడ్డుపెట్టి, నీవు ఏమి లాభాన్ని పొందుతావు? అయ్యో!

81) **ఎన్ తిరుమగళ్ శేర్ మార్బనే! ఎన్నుమ్ ★ ఎన్నుడై అవియే! ఎన్నుమ్ ★**
**నిన్ తిరు ఎయిఱ్ఱాల్ ఇడందు నీ కొండ ★ నిలమగళ్ కేళ్వనే! ఎన్నుమ్ ★**
**అన్ఱురువేழుమ్ తழువి నీ కొండ ★ ఆయ్ మగళ్ అన్బనే! ఎన్నుమ్ ★**
**తెన్ తిరువరంగమ్ కోయిల్ కొండానే! ★ తెళిగిలేన్ ముడివివళ్ తనక్కే ॥ 7.2.9 ॥**

నా పుత్రిక – నాకు, పురుషకారాన్ని చేసే లక్ష్మీదేవిని వక్షఃస్థలంలో కలవాడా! – అని పిలుస్తున్నది. నా ప్రాణమా! – అని పిలుస్తున్నది. వరాహమూర్తివై, నీ అందమైన కోరతో భూమిని గుచ్చి ఎత్తి గ్రహించిన భూదేవీనాయకా! – అని పిలుస్తున్నది. పూర్వం, ఒకానొక సమయంలో ఉరుమువలె గర్జించే ఏడు ఎద్దులను మర్దించి, నీవు వివాహమాడిన గొల్ల కన్య అయిన నీళాదేవికి వల్లభా! – అని పిలుస్తున్నది. శ్రీరంగనాథస్వామీ!, నా పుత్రిక ఆర్తి ఏ విధంగా తీరుతుందో నాకు తెలియడం లేదు.

**82) నాన్ఱిల ఏ*ழ்* ★ మణ్ణుమ్ తానత్తవే ★ పిన్నుమ్**
**నాన్ఱిల ఏ*ழ்* ★ మలై తానత్తవే ★ పిన్నుమ్**
**నాన్ఱిల ఏ*ழ்* ★ కడల్ తానత్తవే ★ అప్పన్**
**ఊన్ఱియిడందు ★ ఎయి*ற்ற*ిల్ కొండ నాళే ॥ 7.4.3 ॥**

భగవంతుడు భూమిని తన దంతంతో గుచ్చి ఎత్తి, దానిని తన కోర చివరలో ధరించినపుడు, ఏడు ద్వీపాలు ఏమీ కదలకుండా తమ తమ స్థానాలలోనే ఉన్నాయి. అంతేకాక, ఏడు కుల పర్వతాలు ఏమీ కదలకుండా తమ తమ స్థానాలలోనే ఉన్నాయి. అంతేకాక, ఏడు సముద్రాలు క్షోభను పొందకుండా తమ తమ స్థానాలలోనే ఉన్నాయి. ఎంత ఆశ్చర్యం!

**83) శూ*ழ்*ల్ కళ్ శిందిక్కిల్ ★ మాయన్ క*ழ்*ల్ అన్ఱిచ్చూ*ழ்*వరో ★**
**ఆ*ழ்* ప్పెరుమ్ పునల్ తన్నుళ్ ★ అ*ழு*న్దియ ఞాలత్తై ★**
**తా*ழ்* ప్పడామల్ ★ తన్ పాల్ ఒరు కోట్టిడై త్తాన్ కొండ ★**
**కే*ழ்*ల్ తిరువురువాయిట్రు ★ కేట్టుమ్ ఉణర్ న్దుమే ॥ 7.5.5 ॥**

అంతులేని ప్రళయసముద్రంలో బాగా లోతుగా మునిగిన భూమిని ఆ విధంగా మునిగిపోనీయకుండా తన మేనిలో ఒక భాగమైన కోరతో గుచ్చి ఎత్తి, ఉద్ధరించిన శ్రీవరాహరూపాన్ని ధరించడాన్ని ఇతిహాస పురాణాల ద్వారా విని తెలిసికొని, దానిని మననం చేసి,

తమ తమ కోరికలు సిద్ధించడంకోసం తగిన ఉపాయాన్ని ఆలోచిస్తే, ఆశ్చర్యకరమైన లీలలను చేసే ఆ స్వామి శ్రీ చరణాలను తప్ప ఇంకొక దానిని దేనినైనా ఆశ్రయిస్తారా?

84) **ఎన్ తిరుమార్బన్ తన్నై ★ ఎన్ మలైమగళ్ కూఱన్ తన్నై★**
**ఎన్ఱుమ్ ఎన్ నామగళై ★ అగంబాల్ కొండ నాన్ముగనై ★**
**నిన్ఱ శశిబదియై ★ నిలమ్ కీండెయిల్ మూన్ఱెరిత్త ★**
**వెన్ఱు పులమ్ తురంద ★ విశుంబాళియై క్కాణేనో ॥ 7.6.7॥**

తన లక్ష్మీనాథత్వాన్ని నాకు ప్రకాశింప చేసినవాడు, పార్వతి పతి అయిన శివునకు అంతర్యామిగా ఉండే విషయాన్ని నాకు తెలియజేసినవాడు, ఎల్లప్పుడూ సరస్వతీదేవిని అంతరంగ పత్నిగా కల బ్రహ్మకు అంతర్యామిగా తాను ఉండే విషయాన్ని నాకు తెలియజేసినవాడు, వీరితో పాటు లెక్కించదగిన ఇంద్రునకు అంతర్యామి, భూమిని వరాహుడై ఉద్ధరించినవాడు, త్రిపురాలను దహించినవాడు, ఇంద్రియాలను నిర్జించినవాడు అయిన సర్వేశ్వరుని దర్శించలేనా!

85) **కాణుమాఱరుళాయ్ ఎన్ఱెన్ఱే కలంగి ★ కణ్ణ నీర్ అలమర ★ వినైయేన్**
**పేణుమాఱెల్లామ్ పేణి ★ నిన్ పెయరే పిదఱ్ఱుమాఱరుళ్ ఎనక్కందో ★**
**కాణుమాఱరుళాయ్ కాగుత్తా! కణ్ణా! ★ తొండనేన్ కఱ్పగ క్కనియే ★**
**పేణువార్ అముదే! పెరియ తణ్ పునల్ శూழ్ ★ పెరు నిలమ్ ఎడుత్త పేరాళా! ॥8.1.2॥**

నేను నిన్ను దర్శించే విధంగా అనుగ్రహించాలని అనేక పర్యాయాలు ప్రార్థించినప్పటికీ నా ఆశ నెరవేరనందున కలతను పొంది, కన్నీరు కారుస్తున్నాను. పాపం చేసిన నేను నీ దగ్గరకు దూతలను పంపించడం మొదలయిన ప్రయత్నాలను చేశాను. అయినా, అవి ఫలించలేదు. నీ నామాలనే నేను కలవరించేటట్లుగా కదా నీవు నాకు చేసిన కృప ఉన్నది. అయ్యో!, ఇంతేనా నా అదృష్టం! శ్రీరాముడవై అవతరించినవాడా!, శ్రీ కృష్ణుడుగా అవతరించినవాడా!, దాసుడను అయిన నాకు కల్పవృక్షం వంటివాడా!, ఆశపడేవారి విషయంలో అమృతంవంటివాడా!,

విశాలమైన, చల్లని ప్రళయ సముద్రంలో మునిగిన భూమిని ఉద్ధరించిన మహానుభావా!, నేను నిన్ను దర్శించే ఉపాయాన్ని నాకు అనుగ్రహించు.

86) **ఆర్ ఉయిరేయో! అగల్ ఇడ ముழுదుమ్ ★ పడైత్తిడందుండుమిழ்ந்దళంద ★**
**పేర్ ఉయిరేయో! పెరియ నీర్ పడైత్తు ★ అంగుళైందదు కడైందడైత్తుడైత్త ★**
**శీరుయిరేయో! మనిశర్కు త్తేవర్ పోల ★ తేవర్కుమ్ తేవావో ★**
**ఓర్ ఉయిరేయో! ఉలగంగట్కెల్లామ్ ★ ఉన్నై నాన్ ఎంగు వందుఱుగో ॥ 8.1.5 ॥**

అరుదయిన ప్రాణమా!, విశాలమైన విశ్వాన్ని అంతటినీ సృష్టించి, దానిని ప్రళయకాలంలో వరాహమై అవతరించి ఉద్ధరించి, తరువాత బొజ్జలో పెట్టుకుని కాపాడి, ఆ తరువాత బయటకు వెలువరించి, ఒకానొక సమయంలో బలిచక్రవర్తి నుండి గ్రహించి పొందిన పరాత్పరా!, సృష్టి ప్రారంభంలో మహాజలాన్ని సృష్టించి, అందులో శయనించి, దానిని చిలికి, అందులో సేతువును కట్టి, ఆ సేతువును కూల్చి పడగొట్టిన చాలా గొప్పవాడా! మనుషులందరికంటే దేవతలు ఏ విధంగా గొప్పవారో, ఆ విధంగా దేవతలందరికంటే కంటే గొప్పవాడవై ఉండేవాడా!, అన్ని లోకాలకు అద్వితీయ ప్రాణమా!, నేను నిన్ను ఎక్కడికి వచ్చి చేరగలను?

87) **ఎంగళ్ శెల్ శార్వు యాముడై అముదమ్ ★ ఇమైయవర్ అప్పన్ ఎన్ అప్పన్ ★**
**పొంగు మూవులగుమ్ పడైత్తళిత్తழிక్కుమ్ ★ పొరుందు మూవురువనెమ్ అరువన్ ★**
**శెంగయల్ ఉగళుమ్ తేమ్ పణై పుడై శూழ் ★ తిరుచ్చెంగున్నూర్ తిరుచ్చిత్రార్ ★**
**అంగమర్ గిన్ఱ ★ ఆదియాన్ అల్లాల్ ★ యావర్ మత్రెన్ అమర్ తుణైయే ॥ 8.4.2 ॥**

మేము వెళ్లి శరణు పొందే చోటుగా, మాకు పరమ భోగ్యంగా, దేవాదిదేవుడుగా, మాకు స్వామిగా, విశాలమైన మూడు లోకాలను సృష్టించి, వరాహమై రక్షించి, సంహరించేవాడుగా, అందుకు తగినట్లు మూడు రూపాలు కలవాడుగా, నాకు ప్రాణప్రదుడుగా, సంతోషంతో చేపలు ఎగిరిపడే, తీయని చెరువులు చుట్టూ కలిగిన 'తిరుచ్చెంగున్నూరు'లో 'తిరుచ్చిత్రారు' అనే

క్షేత్రంలో వేంచేసి ఉన్నవాడుగా ఉండే ఆదిదేవుడు తప్ప నా స్వరూపానికి తగిన రక్షకుడు ఇంకొకడు ఎవ్వరూ లేరు.

**88) ఎన్నమర్ పెరుమాన్ ఇమైయవర్ పెరుమాన్ ★ ఇరు నిలమ్ ఇడంద ఎమ్ పెరుమాన్ ★**
**మున్నై వల్ వినైగళ్ ముఱుదుడన్ మాళ ★ ఎన్నై ఆళ్ గిన్ఱ ఎమ్ పెరుమాన్ ★**
**తెన్ తిశైక్కణి కొళ్ తిరుచ్చెంగున్ఱూరిల్ ★ తిరుచ్చిట్రాట్రంగరై మీబాల్**
**నిన్ఱ ఎంబెరుమాన్ ★ అడియల్లాల్ శరణమ్ నినైప్పిలుమ్ ★ పిఱిదిల్లై ఎనక్కే ॥8.4.3॥**

నిత్యసూరులకు నాథుడు అయినట్లే, మాకు స్వరూపానికి తగిన నాథుడై, ప్రళయకాలంలో భూమిని ఉద్ధరించిన మా స్వామి అనాదికాలంగా అనుసరించి వచ్చే బలమయిన మా పాపాలను అన్నిటినీ వెంటనే నశించేటట్లు చేసి, నన్ను పాలించే మహిమ కలిగిన మా స్వామి, దక్షిణ దిక్కుకు అలంకారమని చెప్పబడే తిరుచ్చెంగున్నూరులో 'తిరుచ్చిట్రారు' అనే దివ్యదేశంలో ఉండే పైభాగంలో వేంచేసి ఉన్న మా ప్రభువుయొక్క చరణాలు తప్ప, నాకు భావించే దశలో కూడా ఇంకొక శరణం లేదు.

**89) అవనే అగల్ ఞాలమ్ ★ పడైత్తిడందాన్ ★**
**అవనే అహ్ దుండుమిழ்న్దాన్ ★ అళందాన్ ★**
**అవనే అవనుమ్, అవనుమ్ అవనుమ్ ★**
**అవనే మట్రెల్లాముమ్ ★ అఱిందనమే ॥ 9.3.2 ॥**

విశాలమైన ఈ జగత్తును సృష్టించినది, వరాహమూర్తియై ఉద్ధరించినది, ఆ స్వామియే. దానిని ఆరగించి, వెలువరించింది కూడా ఆ స్వామియే. అతడే బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు. మిగిలిన చేతనాచేతనాలు అన్నీ అతడే అనే విషయాన్ని అతడు అనుగ్రహించిన జ్ఞానంతో తెలిసికొన్నాము.

90) **పుగలిడమ్ అఱిగిలమ్ తమియమ్ ఆలో! ★**

**పులంబుఱు మణి తెన్ఱల్ ఆంబల్ ఆలో! ★**

**పగల్ అడు మాలై వణ్ శాందమ్ ఆలో! ★**

**పంజమమ్ ముల్లై తణ్ వాడై ఆలో! ★**

**అగల్ ఇడమ్ పడైత్తిడందుండుమిౙ్న్దు అళందు ★**

**ఎంగుమ్ అళిక్కిన్ఱ ఆయన్ మాయోన్ ★**

**ఇగలిడత్తశురర్గళ్ కూఱ్ఱమ్ వారాన్ ★**

**ఇనియిరుందెన్నుయిర్ కాక్కుమ్ ఆఱెన్ ॥ 9.9.2 ॥**

భగవంతునకు దూరమైన మేము, తలదాచుకునే చోటు ఏదో తెలిసికోలేకుండా ఉన్నాము, అయ్యో! ఆవు మెడలోని మోగే గంటలు, మలయమారుతం మమ్ములను బాధించే రీతి చెప్పడానికి సాధ్యం కాకుండా ఉన్నది. పగటి వేళ పూర్తి అయి, సమీపించిన ప్రదోషకాలం, చక్కని చందనం, కోకిల కూసే పంచమస్వరం, మల్లెపూల మాలికలు, చల్లని గాలి, మమ్ములను పెట్టే బాధ చెప్పరానిది. విశాలమైన భూమిని ఉద్ధరించి, ఆరగించి, వెలువరించి, కొలిచి అన్ని రీతులా రక్షించేవాడు, యుద్ధభూమిలో రాక్షసులకు మృత్యువు వంటివాడు, ఆశ్చర్యకరమైన లీలలను చేసేవాడు అయిన గోపాలుడు ఇంకా రాడే! నా ప్రాణాలను రక్షించుకునే దారి ఏది?

91) **తానే ఉలగెల్లామ్ ★ తానే పడైత్తిడందు ★**

**తానే ఉండుమిౙ్న్దు ★తానే ఆళ్వానే ॥ 10.5.3 ॥**

నారాయణుడు అయిన తానే సకల జగత్తును శరీరంగా కలిగిఉండేవాడు. ఆ స్వామి తానే అసహాయుడుగా లోకాలను సృష్టించి, ప్రళయజలంనుండి ఉద్ధరించి, ఎవరి అపేక్షా లేకుండా ప్రళయసమయంలో ఆరగించి, తరువాత వెలువరించి, దానిని నిర్వహిస్తున్నాడు.

92) కూవి క్కొళ్ళాయ్ వందందో! ★ ఎన్ పొల్లా క్కరు మాణిక్కమే! ★
ఆవిక్కోర్ పఱ్ఱుక్కొంబు ★ నిన్నలాల్ అఱిగిన్ఱిలేన్ యాన్ ★
మేవి త్తొழுమ్ పిరమన్ శివన్ ★ ఇందిరన్ ఆదిక్కెల్లామ్ ★
నావి క్కమల ముదఱ్కిழங్గే! ★ ఉంబర్ అందదువే ॥ 10.10.3 ॥

కోరి భజించే బ్రహ్మరుద్రేంద్రాదులకు అందరికీ మూలకారణమైన నాభీకమలాన్ని కలిగినవాడా!, నిత్యాసూరులకు ప్రియమైనవాడా!, ఆత్మకు సాటి లేని పట్టుకొమ్మ అయిన నిన్ను తప్ప నేను ఎవ్వరినీ రక్షకుడుగా ఎరుగను. నన్ను నీ దగ్గరకు పిలిచి, గ్రహించు.

93) కోల మలర్ ప్పావైక్కన్బాగియ ★ యెన్ అన్బేయో ★
నీల వరై ఇరండు పిఱై కవ్వి ★ నిమిర్ న్దదొప్ప ★
కోల వరాగమ్ ఒన్ఱాయ్ ★ నిలమ్ కోట్టిడై క్కొండ ఎందాయ్ ★
నీల క్కడల్ కడైందాయ్! ★ ఉన్నై ప్పెఱ్ఱిని ప్పోక్కువనో ॥ 10.10.7 ॥

అందమైన, సుకుమారి అయిన లక్ష్మీదేవికి వల్లభుడవై, ఆమె అనుగ్రహాన్ని పొందినందున, నా పట్ల ప్రేమను కలవాడా! నీలగిరి రెండు చంద్రవంకలను రెండు వైపుల అమర్చుకొని, పైకి లేచినట్లుగా, అందమైన, అద్వితీయమైన వరాహమూర్తివై, భూమిని కోరదంతం చివరలో లేవనెత్తినవాడా!, నా స్వామీ!, నల్లని సముద్రాన్ని చిలికినవాడా!, నిన్ను శరణంగా పొంది, నా చేతికి అందిన పిమ్మట నిన్ను విడువగలనా!



# అనుబంధం

ఆళ్వార్ల దివ్యప్రబంధాలలో వరాహస్వామి వైభవాన్ని తెలియజేసే పాశురాలలో ఆ అవతారానికి సంబంధించి ఎన్నో విశేషాలు కనిపిస్తాయి. ఆ అవతారనికి సంబంధించిన ఆయా విశేషాలను తెలిపే పాశురాల ఆకరాలు ఇక్కడ చూపబడుతున్నాయి. ఇవి, ఆ అవతారానికి సంబంధించిన ఏ విశేషం, ఏఏ పాశురాలలో గోచరిస్తుందో సులభంగా తెలిసికొనే సౌకర్యాన్ని కలుగజేస్తాయి.

## రూప వర్ణన:

1. పెరియాళ్వార్ తిరుమొళి (4-8-8) – వల్ ఎయిట్రు క్కేళలుమాయ్
2. తిరుచ్చన్దవిరుత్తమ్ (114) – ఓర్ ఎయిట్రు ఏనమాయ్
3. పెరియ తిరుమొళి (1-1-4) – నెడు విశుంబణవుమ్ పన్ఱియాయ్
4. పెరియ తిరుమొళి (2-5-6) – వళై మరుప్పిన్ ఏనమ్ ఆగి
5. పెరియ తిరుమొళి (3-1-1) – ఏనమ్ అదాయ్ వళై మరుప్పినిల్
6. పెరియ తిరుమొళి (3-4-3) – వైయ్య మణైంద నుదిక్కోట్టు వరాగమొన్ఱాయ్
7. పెరియ తిరుమొళి (4-4-8) – శిలంబిన్ ఇడై చ్చిఋ పరల్ పోల్ పెరియ మేరు తిరుక్కుళంబిల్ కణగణప్ప త్తిరువాకారమ్ కులుంగ
8. పెరియ తిరుమొళి (5-6-3) – ఏన్ ఆగి ఉలగిడందు అన్ఱిరు నిలనుమ్ పెరు విశుంబుమ్ తాన్ ఆయ పెరుమానై
9. పెరియ తిరుమొళి (7-8-4) – శిలంబు ముదల్ కలన్ అణిందోర్ శెంగణ్ కున్ఱమ్ తిగళ్న్దెన త్తిరువురువమ్ పన్ఱియాగి
10. పెరియ తిరుమొళి (8-8-3) – వళై మరుప్పిల్ ఏరార్ ఉరువత్తేనమాయ్

11. పెరియ తిరుమొ*ழி* (9–1–4) – వెన్ఱి శేర్ తిణ్మై విలంగల్ మా మేని వెళ్ళెయిర్రొళ్ళెరిత్తఱు కణ్ పన్ఱియాయ్

12. పెరియ తిరుమొ*ழி* (11–4–3) – ఉలగే*ழ*నోడుమ్ ఉడనే మాదిర మణ్ శుమంద వడ కున్ఱుమ్ నిన్ఱ మలైయాఱుమ్ ఏ*ழு* కడలుమ్ పాదమర్ శూ*ழ்* కుళంబిన్ అగ మండలత్తిన్ ఒరుబాల్ ఒడుంగ వళర్ శేర్ ఆది మున్ ఏనమాగి

13. ముదల్ తిరువన్దాది (9) – పొరుగోట్టోర్ ఏనమాయ్

14. ముదల్ తిరువన్దాది (84) – వరాగ త్తెయి*ற்ற*ళవు పోదా వాఱెన్ కొలో ఎంద్రై అడిక్కళవు పోంద పడి

15. ఇరణ్డామ్ తిరువన్దాది (31) – వరాహ త్తణి ఉరువన్

16. పెరియతిరుమడల్ – వళైమరుప్పిన్ కొన్నవిలుమ్ కూర్ నుది

17. తిరువాయ్ మొ*ழி* (2–3–5) – ఏనమ్ ఒన్ఱాయ్నునియార్ కోట్టిల్

18. తిరువాయ్ మొ*ழி* (7–5–5) – తన్ పాల్ ఒరు కోట్టిడై త్తాన్ కొండ కే*ழ*ల్ తిరువురువు

19. తిరువాయ్ మొ*ழி* (10–10–7) – నీల వరై ఇరండు పిఱై కవ్వి నిమిర్ న్దదొప్ప కోల వరాగమ్ ఒన్ఱాయ్

**స్వభావం:**

1. పెరియా*ழ்*వార్ తిరుమొ*ழி* (4–1–9) – ఎణ్ణఱ్కరియదోర్ ఏనమ్ ఆగి
2. నాచ్చియార్ తిరుమొ*ழி* (11–8) – మానం ఇలా ప్పన్ఱియామ్
3. తిరుచ్చన్దవిరుత్తమ్ (102) – మాయ పన్ఱి ఆయ
4. పెరియ తిరుమొ*ழி* (3–2–3) – వెంబుమ్ శినత్తు ప్పున క్కే*ழ*ల్ ఒన్ఱాయ్

**వరాహస్వామి, భూదేవి:**

1. నాచ్చియార్ తిరుమొ*ఴి* (11–8) – పాశి తూర్తు క్కిడంద పార్ మగట్కు పండొరునాళ్ మాశుడంబిల్ నీర్ వారా మానమ్ ఇలా ప్పన్టియామ్
2. పెరియ తిరుమొ*ఴి* (2–6–3) – ఏనత్తిన్ ఉరువాగి నిల మంగై ఎ*ఴి*ల్ కొండాన్
3. పెరియ తిరుమొ*ఴి* (4–4–8)– నిల మడందై తనై ఇడందు పుల్గి
4. పెరియ తిరుమొ*ఴి* (5–3–5) – మణ్ మగళ్ అ*ఴు*మ్గ మున్నీర్ ప్పరప్పిల్ ఏనమ్ ఆగి
5. పెరియ తిరుమొ*ఴి* (7–8–4) – పువి మడందై తనై ఇడందు పుల్గి
6. పెరియ తిరుమొ*ఴి* (9–1–4) – పన్టియాయ్ అన్టు పార్ మగళ్ పయలై తీర్తవన్
7. మూన్టామ్ తిరువన్దాది (54) – క్కే*ఴ*లాయ్ మీళాదు మణ్ అగలమ్ కీండు అంగోర్ మాదుగంద మార్వఱ్కు పెణ్ అగలమ్ కాదల్ పెరిదు
8. తిరువాయ్ మొ*ఴి* (4–2–6) – మాదర్ మా మణ్మడందై పొరుట్టు ఏనమ్ ఆయ్ ఆదియంగాలత్తు అగల్ ఇడమ్ కీండవర్
9. తిరువాయ్ మొ*ఴి* (7–2–9) – నిన్ తిరు ఎయిట్రాల్ ఇడందు నీ కొండ నిలమగళ్

**భూమిని అండ భిత్తి నుండి వేరు చేయడం, దంతంతో గుచ్చి ఎత్తడం, ధరించడం మొదలైనవి:**

1. పెరియా*ఴ్*వార్ తిరుమొ*ఴి* (2–10–9) – ఏనత్తు ఉరువాయ్ ఇడంద ఇమ్మణ్ణినై
2. పెరియా*ఴ్*వార్ తిరుమొ*ఴి* (4–1–9) – ఎణ్ణఱ్కరియదోర్ ఏనమ్ ఆగి ఇరునిలమ్ పుక్కిడందు
3. పెరియా*ఴ్*వార్ తిరుమొ*ఴి* (4–8–8) – వల్ ఎయిట్రు క్కే*ఴ*లుమాయ్ వాళ్ ఎయిట్రు చ్చీయముమాయ్ ఎచ్చి ఇల్లా త్తరణియైయుమ్ అవుణనైయుమ్ ఇడందాన్
4. పెరియా*ఴ్*వార్ తిరుమొ*ఴి* (5–1–5) – కే*ఴు*ల్ ఒన్టాగి కోట్టు మణ్ కొండ
5. పెరియా*ఴ్*వార్ తిరుమొ*ఴి* (5–2–3) – ఎయిట్రిడై మణ్ కొండ ఎందై
6. పెరుమాళ్ తిరుమొ*ఴి* (2–3) – ఏనమాయ్ నిలమ్ కీండదుమ్

7. తిరుచ్చన్దవిరుత్తమ్ (28) – పార్ ఇడందు
8. తిరుచ్చన్దవిరుత్తమ్ (48) – అదొన్నిడందు పన్నియాయ్
9. తిరుచ్చన్దవిరుత్తమ్ (61) – ఞాలమ్ ఏనమాయ్ ఇడంద
10. తిరుచ్చన్దవిరుత్తమ్ (114) – ఞాల ముట్రుమ్ ఓర్ ఎయిట్రు ఏనమాయ్ ఇడంద మూర్తి
11. పెరియ తిరుమొ*ழி* (1–1–4) – పన్నియాయ్ అన్రు పారగమ్ కీండ
12. పెరియ తిరుమొ*ழி* (1–4–1) – ఏన మునాగి ఇరు నిలమ్ ఇడందు
13. పెరియ తిరుమొ*ழி* (2–5–6) – పార్ ఇడత్తె ఎయిఱు కీఱ ఇడందానై
14. పెరియ తిరుమొ*ழி* (3–1–1) – మా నిలమ్ ఏనమ్ అదాయ్ వళై మరుప్పినిల్ అగత్తొడుక్కి
15. పెరియ తిరుమొ*ழி* (3–2–3) – క్కె*ழ*ల్ ఒన్రాయ్ విరి నీర్ ముదు వెళ్ళమ్ ఉళ్ పుక్క్రున్ద వంబుణ్ పొ*ழి*ల్ శూ*ழ்* ఉలగన్రెడుత్తాన్
16. పెరియ తిరుమొ*ழி* (3–4–3) – క్కోట్టు వరాగమ్ ఒన్రాయ్ మణ్ ఎల్లాంమ్ ఇడందెడుత్తు
17. పెరియ తిరుమొ*ழி* (4–4–8) – నిల మడంద్దై తనై ఇడందు పుల్గి కోట్టిడై వైత్తి
18. పెరియ తిరుమొ*ழி* (4–7–8) – వరాగమ్ అదాగి ఇమ్మణ్ణై ఇడందాయ్
19. పెరియ తిరుమొ*ழி* (4–10–10) – పండు మున్ ఏనమ్ ఆగి అన్రొరుగాల్ పార్ ఇడందెయిట్రినిల్ కొండు
20. పెరియ తిరుమొ*ழி* (5–3–5) – ఏనమ్ ఆగి అన్నిరు నిలమ్ ఇడందవనే!
21. పెరియ తిరుమొ*ழி* (5–6–3) – ఏన్ ఆగి ఉలగిడందు
22. పెరియ తిరుమొ*ழி* (6–10–1) – కే*ழ*లాయులగై ఇడంద నంబి
23. పెరియ తిరుమొ*ழி* (6–10–2) – ఇడందాన్ వైయమ్ కే*ழ*ల్ ఆగి
24. పెరియ తిరుమొ*ழி* (7–4–6) – పండేనమాయ్ ఉలగై అన్నిడంద

25. పెరియ తిరుమొழி (7-8-4) - పన్నియాగి ఇలంగు పువి మడంద్దై తనై ఇడందు పుల్గి ఎయిற్றిడై వైత్తి

26. పెరియ తిరుమొழி (8-4-6) - పారై ప్పిళంద పరమన్

27. పెరియ తిరుమొழி (11-4-3) - ఉలగేழுనోడుమ్ ఉడనే మాదిర మణ్ శుమంద వడ కున్ఱుమ్ నిన్ఱ మలైయాఱుమ్ ఏழு కడలుమ్ పాదమర్ శూழ் కుళంబిన్ అగ మండలత్తిన్ ఒరుబాల్ ఒడుంగ వళర్ శేర్ ఆది మున్ ఏనమాగి అరణాయ మూర్తి

28. పెరియ తిరుమొழி (11-7-6) - ఓర్ ఏనమాయ్ పుక్కిడందాన్

29. తిరుక్కురున్దాండగమ్ (4) - కేழலాయ్ ఉలగమ్ కొండ పూ క్కెழு వణ్ణనారై

30. తిరునెడున్దాండగమ్ (20) - పార్ ఇడందు

31. ముదల్ తిరువన్దాది (2) - ఇదు నీ పడైత్తిడందుండుమిழ்న్ద పార్

32. ముదల్ తిరువన్దాది (9) - పొరుగోట్టోర్ ఏనమాయ్ పుక్కిడందాయ్ క్కు

33. ముదల్ తిరువన్దాది (25) - కేழலాయ్ పూమిఇడందానై

34. ముదల్ తిరువన్దాది (39) - ఇడందదు పూమి

35. ముదల్ తిరువన్దాది (91) - ఏనత్తురువా ఉలగిడంద

36. ఇరణ్డామ్ తిరువన్దాది (30) - నీ అన్ఱులగిడందాయ్

37. ఇరణ్డామ్ తిరువన్దాది (47) - ఇాలమ్ అళందిడందు

38. మూన్ఱామ్ తిరువన్దాది (54) - క్కేழலాయ్ మీళాదు మణ్ అగలమ్ కీండు

39. నాన్ముగన్ తిరువన్దాది (70) - తరణి ఇడందెడుత్తు ఏన్ ఒరువనాయ్ ఎయిఱ్ఱిల్ తాంగియదుమ్

40. తిరువిరుత్తమ్ (99) - ఎటి తిరై వైయమ్ ముఱ్ఱుమ్ ఏనత్తురువాయ్ ఇడంద పిరాన్

41. తిరువాశిరియమ్ (6) - పడైత్తిడందుండుమిழ்న్దళందు తేర్ న్దులగళిక్కుమ్

42. పెరియ తిరువన్దాది (7) - పార్ ఇడంద

43. పెరియ తిరువన్దాది (42) – పార్ ఇడందాన్
44. తిరువాయ్ మొ*ళ్రి* (1-7-6) – పిరాన్ పెరు నిలమ్ కీండవన్
45. తిరువాయ్ మొ*ళ్రి* (1-9-2) – ఉలగై కే*ళ్రు*ల్ ఒన్ఱాగి ఇడంద కేశవన్
46. తిరువాయ్ మొ*ళ్రి* (2-3-5) – పొ*ళ్రి*ల్ ఏ*ళ్రు*మ్ ఏనమ్ ఒన్ఱాయ్ నునియార్ కోట్టిల్ వైత్తాయ్
47. తిరువాయ్ మొ*ళ్రి* (2-8-7) – కే*ళ్రు*లాయ్ క్కీ*ళ్రు* పుక్కిడందిడుమ్
48. తిరువాయ్ మొ*ళ్రి* (4-10-7) – పల్లులగుమ్ పడైత్తు అన్ఱుడనే వి*ళ్రు*ఙ్గి కరందుమి*ళ్రు*న్దు కడందిడందదు
49. తిరువాయ్ మొ*ళ్రి* (5-6-1) – కడల్ ఞాలమ్ కీండేనుమ్ యానే ఎన్నుమ్
50. తిరువాయ్ మొ*ళ్రి* (5-7-4) – నిలంగీండ అమ్మానే
51. తిరువాయ్ మొ*ళ్రి* (5-7-6) – ఏనమాయ్ నిలమ్ కీండ ఎన్నప్పనే!
52. తిరువాయ్ మొ*ళ్రి* (5-10-5) – మణ్ణై మున్ పడైత్తుండుమి*ళ్రు*న్దు కడందిడందు
53. తిరువాయ్ మొ*ళ్రి* (6-6-5) – మణ్ పుఱై వైయమ్ ఇడంద వరాగఱ్కు
54. తిరువాయ్ మొ*ళ్రి* (7-1-3) – ఇడం పడైత్తు ఉండుమి*ళ్రు*న్దు కడందిడందిట్ట
55. తిరువాయ్ మొ*ళ్రి* (7-2-9) – నిన్ తిరు ఎయిట్రాల్ ఇడందు నీ కొండ నిలమగళ్ కేళ్వనే! ఎన్నుమ్
56. తిరువాయ్ మొ*ళ్రి* (7-4-3) – నాన్గిల ఏ*ళ్రు* కడల్ తానత్తవే అప్పన్ ఊన్ఱియిడందు ఎయిట్రిల్ కొండ
57. తిరువాయ్ మొ*ళ్రి* (7-5-5) – ఆ*ళ్రు* ప్పెరుమ్ పునల్ తన్నుళ్ అ*ళ్రు*న్దియ ఞాలత్తై తా*ళ్రు* ప్పడామల్ తన్ పాల్ ఒరు కోట్టిడై త్తాన్ కొండ కే*ళ్రు*ల్ తిరువురువాయిట్రు
58. తిరువాయ్ మొ*ళ్రి* (7-6-7) – నిలమ్ కీణ్డు
59. తిరువాయ్ మొ*ళ్రి* (8-1-5) – అగల్ ఇడ ము*ళ్రు*దుమ్ పడైత్తిడందు
60. తిరువాయ్ మొ*ళ్రి* (8-4-3) – ఇరునిలమ్ ఇడన్ద ఎంబెరుమాన్

61. తిరువాయ్ మొ*ழி* (9–3–2) – అవనే అగల్ ఇాలమ్ పడైత్తిడన్దాన్

62. తిరువాయ్ మొ*ழி* (9–9–2) – ఇడమ్ పడైత్తు ఉండుమి*ழ*న్దు కడందిడందిట్ట

63. తిరువాయ్ మొ*ழி* (10–5–3) – ఉలగెల్లామ్ పడైత్తిడన్దు

64. తిరువాయ్ మొ*ழி* (10–10–7) – కోల వరాగమ్ ఒన్ఱాయ్ నిలమ్ కోట్టిడై క్కొండ ఎందాయ్

